పరసహాయార్థ సం । భావితులనుగూర్చి
సమతనారయు పూజ్య । తములు లేక
ఆత్మాభిమాన స । మాదరణ పరస్పర
మైత్రత గోరు వా । రలును లేక
గీ. జాతి హీనతచే గృంగె । ఖ్యాతిఁ గూర్చ
యువకులున్ సంఘనాయకు । లొకటిగాఁగఁ
జేరి పూనికతోఁ బని । చేయకున్న
నున్నగాకొందు కీర్తి యే । మున్నదింక;

దేశసేవాపరాయణు లుద్భవించిన భారతమాతృ పవిత్రగర్భముగ సంఘసేవాదురంధరు లుద్భవించు భాగ్యము సెట్టిబలిజ సంఘమునకుఁ బట్టినది గాదు. కనుకనే యిట్టి దీనదశకు సంఘము పాల్పడవలసి వచ్చినది.

ఎడతెగని విద్యాబుద్ధులతోడను మొక్కవోని పౌరుషప్రవత్తులతోను గిశలు నిండిన యశః కాంతులతోను దులఁదూగు భాగ్యము సెట్టిబలిజ సంఘమున కెన్నడైన పట్టునా? అయ్యో! ఎక్కడి భాగ్యము?

గీ. భాగ్యభోగ్యంబులున్నట్టి । వారలెంక
యున్న నేమగు? నాత్మీయ । యువకతతికి
విద్య యొక్కింతయైనను । వెలయునట్లు
పాటుపడరైరి కులమెల్ల । పైకివచ్చు.

విద్యావంతులును సాహసము కలవారునగు యువకులీకార్యరంగమున ముందు కాలిడవలయును. ఉదారస్వభావులగు ధనికులీయుద్యమమును ప్రోత్సహించవలయును. ఎన్ని చెప్పినను స్వకులకులాభిమానశౌర్యధైర్యాదుల నలరాగు మానవహృదయమే హృదయము. స్వీయసంఘాభ్యుదయమునకై వినియోగింపఁబడు జన్మయే యుత్తమజన్మము.

చినంత ఫలము. ఏదో మనవెఱ్ఱిగాని విషయభోగలాలసులగు వారి కీయవస్తలన్నియు నెందులకు. ఎవరేమైన వారికేమిగా వలయును. చింతించుటసంగతి యటుంచి కన్నెత్తిగాంచుటకుఁ గూడ వారికిఁ దీరికయుండదు. అంత అగత్యముగూడ లేదు.

ఖడ్గ—అట్లనవలదు. ప్రయత్నించి వారియభిప్రాయమును దెలిసి కొనవిదే ఇట్టిచిత్రమును సిద్ధయించుట కష్టముగదా?

పా—అదికూడ నెనపి సంగతి మీకే తెలియగలదు.

ఖడ్గ—మిత్రమా! మీమాట యు నిజమే. క్రమశిక్షణలేక నేర్చిన యత్నము ప్రవర్తనకు విద్యావిహీనతయే కారణము. కాని శిక్షణలేనివారి యవిశ్వాసకు సంపదమూలమెట్లగును. ధనవంతులై విద్యావంతులైన మహానీయులెందరు లేరు. సద్గుణసంపత్తులను సంపాదించుకొనవలయునను పట్టుదల యువకునందును, తనబిడ్డలను ధీమంతులుగను, విద్యావంతులుగను, చేయవలయునను నభిలాష తల్లిదండ్రులయందును, నున్ననేగాని తాముగాని సంఘముగాని ధన్యతఁ గాంచుటెట్లు? చదివి సర్వస్వము నెరింగి సంస్కర్తలై సంఘమును సేవకితేవలసిన ధీశాలురగు యువకులే యుక్తివిషయములందుటతామునఁ జిక్కుకొని తమ భోగ్య భాగ్యములను కాఫీహోటేళ్ళకు, కపటస్నేహితులకు, విదేశ వస్తువులకు, విస్కీబుడ్లకు, వేశ్యలకు వెఱ్ఱి మొఱ్ఱిపనులకు వెచ్చించుచున్నప్పుడు సామాన్యుల ననవలసిన దేమున్నది. సంఘముస్థితికి విచారింపవలసిన దేమున్నది. ఇట్టిదుర్వ్యసనముల నుండి విరమించు ప్రీతివారును సంఘసేవ కుపక్రమించకున్నచో భారతజాతీయ నిర్మాణమును నీసంఘము తలఎత్తుటకే తావుండదు. సరే? ప్రస్తుత మీవిషయము లట్లుంచుదము. గాని యిక మనభావి కర్తవ్యమేమి.

పురు—ఏమున్నది. ప్రచారమే?

ఖడ్గ—ఊరక తిరిగినమాత్రమే మేమిలాభము. మన యుద్యమమును ప్రోత్సహింపదగిన ధనవంతులను మనతో కలసి పనిచేయు నాయకులను ముందుచూడవలయును. పిమ్మట విద్యాది విషయములపై సత్ప్రబోధము సాగించవలయును. దానితోగాని యీసంఘము నావరించిన యజ్ఞానపిశాచ మతొలగదని నా నమ్మకము.

పురు—నేనును అట్లే యూహించితిని. అజ్ఞానతిమిరమునకు విద్యాభ్యాసమే నిర్మలసూర్యకాంతి.

ఖడ్గ—ఊహలు బాగుగనే యున్నవి. ఉద్యమమో!

పురు—అదియు జయప్రదముగనే యున్నది. మొన్ననే నాపర్యటనమున నొకమంచి సంఘాభిమానిని సంపాదించితిని.

ఖడ్గ—పేరు.

పురు—దురోదరుడు.

ఖడ్గ—వారియుదంతము.

పురు—రంగయ్యగారను ధనికునికి హితవాసంగుమంత్రి. మంచివక్త, శ్రీమంతుడు, పలుకుబడికలవాడు. వానితో మనయుద్యమమునుగూర్చి మాట్లాడితిని. వారలయుత్సాహమును చూపుచు రంగయ్యగారికీసంగతి నెరింగించి, తమశక్తివంచనలేనివిధమున పాటుపడుదునని వచించిరి.

ఖడ్గ—అట్లయిన సంఘప్రజలు చాల నదృష్టవంతులే! రంగయ్యగారినిగూర్చి నేనుకూడ వినియుంటిని. భాగ్యవంతులు పూనుకొన్న నేకార్యము జరుగకుండనుండును.

[ఇంతలో నొకవ్యక్తి ప్రవేశించి] ఖడ్గనారాయణసెట్టిగారి కొరకెవరో నిరీక్షించుచున్నారు. [అని నిష్క్రమించును]

ఖడ్గ—నాగొరకెవరో వచ్చియున్నారట. ఇక నే సెలవుగైకొందును. నేనిపరిసరగ్రామములు ప్రచారముచేయుదును. గాని మీరు మాత్రము చేయవలసిన పనులయం దేమరకుఁడు.

పురు—ముందు నాధర్మమును నెరపికొననిదె అన్యము చూకను.

ఖడ్గ—అదియె కావలయును.

(నిష్క్రమించును.)

పురు—ఆహా! ఏమిభాగ్యము. హృదయమున నిట్లుండవలయును. ప్రజలందరియందు నింత గాఢసంఘాభిమానమున్న చో సంఘ సౌభాగ్య మెట్లుండెడిదోగదా! కార్యదీక్షాతత్పరుఁడగు నిట్టి మహానీయుని గన్న తల్లిదండ్రులెంతయు నదృష్టవంతులు. తల్లిదండ్రులే కాదు సెట్టిబలిజసంఘముగూడ చాలనదృష్టము చేసికొనినది.

సీ. చదువు కూడెట్టునా? చదువక మావార
లవనిపై బ్రదుకరే? యనెడివారు
కడులుబ్ధులై కన్న కొడుకులం జదివింప
వ్యయమగునని లోన వగచువారు
సంపదగలమాకు చదువులేలయని వృథా
సోమరులై యింట జోగువారు
పాపకార్యములకై భాగ్యమెల్లను గంగ
పాల్సేసి కీర్తిఁ బాయువారు
నగుచుఁ నెందఱో వర్తిల్లు నదనునందు
దుర్భరజ్ఞానతిమిరంబు తొలఁగ జేయ
రవిసమానుఁడు ఖడ్గనారాయణుండు
భాగ్యవశమునఁ గాక సంప్రాప్తమగునె?

పూవునకు పుట్టుకయందే పరిమళముండును. జన్మముతో వచ్చిన యీతని యసాధారణ సంఘాభిమాన ముగ్గుతో పోసిన పాలవలె జీర్ణించి యున్నది. చిన్ననాటనుండియు "నాసంఘము" "నాప్రజ" యను పాటతప్ప వేఱువానిపై నీతని దృష్టి పోననేలేదు. బడినైనను బయటనైనను జాతీయనిర్మాణ కార్యక్రమమును నూహాతరంగముల నూగులాడుటయే యీతని నిత్యకృత్యము. దైవమీయుద్యమమును జయప్రదముగ నడపించుగాక! సాంఘికులీ హితవచనములను సార్థకముగ నాచరింతురుగాక! నే నిక సరగి మహోదయుని గలసికొందును.

విరమించును.

# సెట్టిబలిజసంఘసేవ

## ద్వితీయాంకము

౧౦గము—పురవీధి

(ప్రవేశము—చక్రపాణిసెట్టి)

చక్ర—ఈ ప్రవర్తన కొకరియనుమతి నొందుదలను. నన్నుపిచ్చివాడని కొందరని యనుకొన్నంత మాత్రమున భయమున్నదా? బుద్ధిహీనులు. ప్రపంచములో నందరు సరిగనున్నారా? ఎవరియిష్టము వారిది. ఎవరిపిచ్చి వారి కానందము. పిచ్చియేమిటి వాళ్ల ముఖము. చదువుబుద్ధులు తెలిసికొనలేక ఏదో తినుచున్నారు. తిని కూర్చుండలేక పెద్దమన్నలు సంఘాభిమానమును వెర్రిబండలని ఎగతాళి ఎగతాళి పడుచున్నారు. వీరా! సంఘమునకు శాంతి చేయునది మాటలు గాక.

(ప్రవేశము—దుర్గోదయుడు)

దుర్గో—(తనలో) అదుగో తెలివితక్కువ సన్యాసి. ఏదో గొణుగు కొనుచున్నాడు. సమీపించి సంగతి తెలిసికొందును. (ప్రకాశముగా) చక్రపాణిసెట్టిగారా! ఎక్కడయో యాలోచించుచున్నారు.

చక్ర—ఆలోచనకేమున్నది. నా కభిమానమే లేదట.

దుర్గో—అదేమిటి? తమకే? ఎంతమాట? ఎవడా అన్న దుర్మార్గుడు.

చక్ర—దుర్మార్గుడో సన్మార్గుడో! పేరు తెలియదు. అనుకొనుచున్నారట.

దురో—సరి, సరి. తమవంటి మహానుభావులనే. ఎవరో తుంటరి వాండ్రు. తమసంగతి తెలియనివాండ్రు అనవలెగాని తెలసిన వాళ్లెన్నఁడు ననరు.

చక్ర—మైఁగా పిచ్చివాఁడనన్నారట.

దురో—వాళ్లే పిచ్చివాండ్రు. అయినా గాంధీమహాత్మునంతటి వారినే పిచ్చివాడని యంటుంటే మీకు వచ్చినగా ? ఇంకొక సంగతి. సంఘాభిమానమేమిటి. అదియొక పిచ్చి.

చక్ర—అదేనా యూహా !

దురో—నిజము. ఈ రోజులలో యీ సంఘాభిమానములు సంఘోద్ధరణలు ఇవి వుంచుకొంటే వ్యవహారములు జరిగినట్టే. ఎవరైనా పనిపాటలు లేనివాళ్లు యిది యొకపని కల్పించుకొని సంఘముకోసరమూ, సమాజముకొఱకు పాటుపడవలెనన్నఓ! అభ్యంతరమేమున్నది ప్రాణములను ధారపోయుటకు సిద్ధముగా నున్నామని చెప్పవలెను. వారు చెప్పుమాటలను భక్తి శ్రద్ధలతో వినువారివలె నటించి, మధ్య మధ్య రానినవ్వు నవ్వుచు, తలయూపుచు యీచెవిని విని ఆచెవిని విడిచిపెట్ట వలయును. నాలుక చెప్పినను నోరు విడువవలయునేగాని చేయి విడువరాదు. ఇంతకూ ఏ ఎండ కాగొడుగుపట్టుట నేర్చుకో వలెను

చక్ర—కనుక నీసంగతినే మీరు చాలమందికి చెప్పియున్నారు. నే నప్పటినుండియు అప్రకారమే నడుచుచున్నాను.

దురో—మంచిది. మీరట్లు గ్రహించి యాచరించు పాటి తెలివిగల వారని నే నెరుంగుదును. దానికేమి గాని సంఘము నొకరు బాగుచేయునదేమున్నది. దానియంతట నదియే బాగుపడ వలయును. పూర్వము నీవిషయములన్నియు తెలియకయూ

యీ యుద్యమము, తమవంటి గాఢ సంఘాభిమానులతో గూడిన పని జయప్రదముగ జరుగుననియే నా నమ్మకము.

దురో—కేవల మిట్లని యూహించుటకు వీలులేదు. భావిస్థితి నిట్లని నిర్ణయించుట కష్టముగదా!

పురు—మీరాలోచించినది నిజమే! కాని శుభమునుగదా నమ్మకము. అయిన నాకు మంచిచెడ్డల నిర్ణయమునకై యిప్పుడుచింతించు టెందులకు? అవన్నియు దైవాధీనములేగాని తమకు గంగయ్య గారితో నేమైన మాటలాడితిరా?

దురో—అతనితోడి యీ సంగతులా? అంతయు నిదివరకే యైనది.

పురు—అట్లయిన కార్యసాఫల్యమైనదన్నమాటే.

దురో—ఫలించనూలేదు. పాడునూ గాలేదు. నేను చెప్పుట వారు వినుటమాత్రమైనది.

పురు—అట్లనుచుంటిరేమి.

దురో—ఏమియు లేదు. ఇంకను కొంత నావకాశమున్నగాని కార్య సిద్ధికాదు. వ్యవధి కలుగ మాత్రమీ పని జరిగింతును.

పురు—కృష్ణనారాయణసెట్టిగారీవిషయమై గంగయ్యగారిని కలసి కొనవలెనా?

దురో—ప్రస్తుతము వలదు. నేను మరియొకసారి మాట్లాడినపిమ్మట ఏగవచ్చును.

పురు—చిత్తము. మీయానతిప్రకారమే చేయుదును (చక్రపాణి నుద్దేశించి) సెట్టిగారూ తామీయుద్యమమున శ్రద్ధగాపని చేయవలయునని ప్రార్థించుచున్నాను.

చక్ర—(అవశ్యముతో) అట్లేచేయుదును.

దురో—ఆసంగతినే వీరి కింతకుపూర్వము నుండియు బోధించుచు చున్నాను.

౨ దృశ్యము

రంగము దుర్గోదరుని యిల్లు.

(ప్రవేశము—సుమతి (స్త్రీ))

సుమ—ఈ యజ్ఞానదశయు నధోగతియు నెన్నటికో రూపుమాయుట మాయుటకే యున్నది మాయకుండుట కేమున్నది.

గీ. అబలలను కష్ట పెట్టుచు । నాత్మగౌర
వంబు కాపాడుకొనలేక । పావనత్వ
మైకమత్యము విద్యయు । నరయ నట్టి
జాతుల కధోగతియె గతి । జగతియందు.

స్త్రైబలిజ సంఘముకూడ నీ తరగతిలోనిదే గావున నేటికీ నూకనము దాల్చినది. విద్యావిహీనతచే గలిగిన నీ యుపద్రవ ముతనలో దీనినరయుగాదు. (ఇంచుక మునుమునకు వచ్చి) తీరకేమి. ఇప్పటికి స్త్రీబలిజసంఘము మొత్తము చేసికొన్నది. మహావక్త్రయు, గాఢసంఘాభిమానినియు నగు ఖడ్గనారాయణుని హస్తగతమైన (ఆశ్చర్యపులకితయై) ఖడ్గనారాయణ నామధేయము నామనోదృష్టి నెంతయు నాకర్షించుచున్నది. (అని ఒడలు ఘాలకరించుకొని) సంఘము తన యిక్కట్లనుండి గట్టెక్కగల కాలము సమీపించినది. కాని నిజముగా జన్మ సత్త్వములను కాపాడుకొనలేని జన్మ యొక జన్మయా!

ఉ. పుట్టుక గాంచినందులకు । భూరియశంబు తెంబు మీఱ చే
పట్టగ జెల్లుగాని యొక । పాటికి మీఱు మనోవ్యథన్ సదా ।
కట్టడి నీచమార్గమున । కాలము బుచ్చుటకన్న కానలో
జెట్టుగబుట్టువొందినను । జెంకగవచ్చు నొకింత సౌఖ్యమున్.

విద్యపై తలంపు, ప్రేమ, విశ్వాసము విడిచిన కారణము చేతనే సంఘమధోగతిపాలైనది. (ఆశ్చర్యముమీాద తనలో) ఏలకో గాని నామనస్సు ఆందోళన పడుచున్నది. నా వివాహవిషయమైన కఠోరవార్త వినిన దాదియు మనస్సు పరిపరి విధములు పోవుచున్నది. దైవమేమి చేయునో ? (అటుచూచి) అదుగో తండ్రిగారు రాచున్నారు.

ప్రవేశము—దురోదరుడు.

దురో—(తనలో) కుమారిక యేదో దీర్ఘాలోచనలో నున్నట్లున్నది. సమీపించి (ప్రకాశముగా) అమ్మాయీ ! ఏమిటి ఆలోచించుచున్నావు.

సుమ—నాన్నగారూ ! ఏమున్నది. సంఘమునుగూర్చి—

దురో—ఏ సంఘమునుగూర్చి.

సుమ—మన సంఘమునుగూర్చి.

దురో—ఏమని.

సుమ—నా ప్రజ, నా వారు, అను నభిమానము లేనివారగుట సంఘ మభివృద్ధి నొందుట కవకాశములేదని.

దురో—ఏ ప్రజ

సుమ—సంఘప్రజ

దురో—ఏ సంఘప్రజ

సుమ—ఏసంఘప్రజయైనను, అందు ముఖ్యముగ సెట్టిబలిజ సంఘ ప్రజ.

దురో—అట్లా! ఈయుపదేశ మెక్కడపొందితివి.

సుమ—పత్రికలనుండి, ప్రచారకులనుండి.

దురో—(తనలో) ఈవ్యాధి అంతఃపురాంగనలకు కూడ సంటుకొని నదే? (ప్రకాశముగా) ఏమది? యింతతిని లోనగూర్చుండక

యీవిషయములన్నియు నీకెందులకు? కులాభిమానము లేనిచో నీకేమి తక్కువగ నున్నదమ్మా.

సుమ—నాకుఁగాదు.

దురో—మరెవరికి.

సుమ—సెట్టిబలిజ నారీమణులకు.

దురో—అనఁగా నీ యభిప్రాయమేమి?

సుమ—అభిప్రాయమున కేమున్నది. అంగనలని సమన్వృష్టితోఁ గాంచి విద్యావంతులుగ చేయ ప్రయత్నించి వారికి వలయు విధముల సౌకర్యములఁ గూర్చుచు మంచిస్థితికిఁదే ప్రయత్నించవలయునని.

దురో—ఆలాగునా? అందఱు అందలమెక్కిన మోయువారెవరు?

సుమ—తండ్రీ! అదేటిమాట. అట్లయిన నితరు లందలమెక్కరాదని నూ మీతలంపు.

దురో—ఔను. ఏస్థానమున నున్నవారి నందేయుండవలయునని.

సుమ—అది విరుద్ధము. పరచింత, పరశ్రేయస్సు కోరని ప్రాణి అస్వాభావిక జీవియని తలంపవలసినదే. అట్టి యీస్వార్థపూరితుల మూలముననే సంఘమిట్టిదుర్గతికి పాల్పడినది.

దురో—(రానినవ్వునవ్వుచు) అమ్మాయీ! నీవు ఆడుదానవుగదా? నీకీవిషయము లెందులకు?

సుమ—ఆడుదాననైన యపరాధమునకు సంఘాభిమాన ముండరాదనియా మీతలంపు. పురుషునకు లౌకికవిషయములవిద్య యెంతముఖ్యమో, స్త్రీలకు సంఘాభివృద్ధికై యంత యావశ్యకము. సంఘముయొక్క యున్నతి స్త్రీరూప స్తంభముపై కట్టవలసియున్నది. అట్టివారికి సంఘాభిమానమలవడకున్న సంఘమునకు ముప్పువాటిల్లుట యనృతముగాదు. నీతి, యాచా

రము, మతము, దేశము, సంఘము వీనివిషయమున తెలివి
గల స్త్రీలు తమసంతతిని బాగుచేసినట్లు మతొకరీతి యాడుది
చేయఁజాలదు. యివి తమ కెఱుంగని విషయములును గావు.

దురో—సరి, సరి, నీవుచాల గ్రంథములోనికి దిగుచున్నావు. యిక
నది కట్టిపెట్టుము—(తనలో) ఈపాండిత్యపటిమ నిదివర కెన్న
డెరుఁగనే ఎఱుఁగను. ఆహా! విద్యయందెట్టి యపూర్వమహాత్య
ము న్నది. కనుకనే స్త్రీలకు విద్యకూడదని పెద్దలు ద్దేసించిరి.
అయిన నాపర్సంశ లిప్పుడెందులకు? గాని,

అమ్మా! ఆవిషయములు మన కెందులకు గాని—నీ వివాహసంబంధ
మైన మొన్నటి నాయుపదేశమును వింటివిగదా?

సుమ—వింటిని.

దురో—నీయభిప్రాయమేమి?

సుమ—(మౌనము)

దురో—(సుమతిగడ్డముం బట్టుకొని) కుమారీ! ముదుసలియను సంశ
యమునుమాత్రము లోన నుంచుకొనకుము. ఇప్పటికాలమున
చూడవలసినది యింత ధనముగాని యితరవిషయములుగావు.
ఈ ప్రపంచమున ముసలివాండ్రను వివాహమాడుకన్నియలు,
పెండ్లిండ్లుచేయు తలిదండ్రులు మూర్ఖులనియేనా నీతలంపు.
మేముమాత్ర మంత యవివేకులమా! పుత్రికా వాత్సల్యము
మాకులేదా? నీశ్రేయస్సును గోరిగదా నేనింత శ్రమపడు
చున్నది. చూడు. ఏబదిసంవత్సరము లేమంతముసలితనము.
చక్కనిఆస్తి—సౌఖ్యముపొందు—ధనములేనిరూపము, విద్య
యౌవనము మున్నగునవన్నియు నిరుపయోగములును, నిష్ప్ర
యోజనములని నీకు వేరుగా చెప్పవలయునా? ధనముగలవాని
కందరును దాసులే? కనుక నాయభిప్రాయమున కడ్డుచెప్పక

యంగీకరించుట యుక్తము. పైగ పితృవాక్య పరిపాలనాధర్మ మునుగూర్చి నీకు తెలయనిదీ, నేనుచెప్పవలసినది లేనేలేదు.

సుమ—(తలవులుమూసుకొని దీనముగాఁదనలో) యిప్పట్టున నాయభి ప్రాయమును వెల్లడించక యూరకున్న చిక్కురాగలదు. (ప్రకాశముగా) జనకా! అభిప్రాయమునకేమున్నది. నామనస్సిది వరకే నొక మహానుభావునియందు లగ్నమైనది.

దురో—అలాగా! ఎవరా మహానుభావుఁడు. ఆహిరణ్యశృంగుఁడు.

సుమ—మహానుభావుఁడేగాదు.మహామహుఁడు—సంఘోద్ధారకుఁడు

దురో—(తనలో) ఎవరుచెప్పుమా? ఖడ్గనారాయణ గాఁడుగదా? (ప్రకాశముగా) ఎవరుఆయన.

సుమ—(సిగ్గుతో) ఖడ్గ—నా—రా—యణ.

దురో—ఛీ—నీచాత్మురాలా! ఏమంటివి?

సుమ—ఖడ్గనారాయణయని.

దురో—(కోపముతగ్గించి) అనుకొన్నంతయునైనది. ఏమిచేయుదును. ఎట్లో హితముఁగరపి మనసు మార్చవలయును. (కుమార్తెను సమీపించి గడ్డముపట్టుకొని) పుత్రీ! నాగౌరవమును కాపాడ తలంపుము.

సుమ—తమ గౌరవమునకేమిభంగము వాటిల్లినది.

దురో—నీవు ప్రాచీనగౌరవ కుటుంబోద్భవురాలవు. దురోదరమహా మహుని పుత్రికారత్నమవు. విద్యాగుణ సంపన్నురాలవు. చూడ—చూడ—నీచుడగు నొకసామాన్య మానవమాత్రుని వివాహమాడుట కొప్పుంగీకరించితివి.పరులువిన్న పరిహాసింపరా? కనులఁగాంచి గరళముఁ గ్రోలువారుందురా?

సుమ—జనకా! పరనిందాపరాయణులును, పరశ్రేయోభివృద్ధికిఁ గంటకప్రాయులును, నగు సాంప్రదాయ కుటుంబమున జనిం

# ద్వితీయాంకము

ములు వ్రాయుటకు సిద్ధముగ నుండవలయును.—[illegible]
చూచెదగాక!—

౨ వ దృశ్యము.

ప్రవేశము—రంగయ్య [illegible]

(ప్రవేశము—రంగయ్య చిదంబరశ్రేష్ఠి [illegible])

చిదం—నాన్నగారూ! సంఘసేవను [illegible] పూర్వకము [illegible]
కొకటి ప్రపంచమున మాదబోము. [illegible]
సంఘాభివృద్ధికి గొప్ప [illegible] మాయము.

సీ. ఆత్మశ్లాఘమూ । నాయన్న గటుగదా
అన్యాయమునకన్న । నధికులగుట
జాతిగౌరవమును । సంగ్రహించుటగదా
పరువుమునకన్న । పేరుగనుట
నీవు చేసెడు పేర । దానమిచ్చుటగదా
ఇతరుల నునకన్న । నధికమగుట
వంతలు వేలును । చందాల నిడిపలెల్
సత్కృతుల్ మనకన్న । సంఘమంట
గానమానమే ప్రాణ । సమానమనుచు
కులము నభివృద్ధిపరచుట । గొప్పతనము
గాని భాగ్యంబుగలదని । గర్వపడుచు
కడుపులకుతిని బ్రిమకుటే । ఘనతచెప్పుడీ!

రంగ—ఆమాట నిజమేగాని-మనకది కూడిరాదు.

చిదం—ఎందులకు?

రంగ—విశేషధన వ్యయకారణమగుట.

చిదం—ఏమంతి ధనవ్యయమున్నది. ఒకవేళ నున్నను మనవంటి ధన
వంతులే యిట్టి వ్యయభారమునకు వెనుదీసిచో నికనెవ్వరి

కార్యభారమును సాగించువారు. ధనమున్నంతలో నిట్టి యవశ్యాచరణీయములగు నుద్యమములకు చేయూత నీయవలసియే యుండును. ధనవంతులై తమ్ముతామే గని సంతసించుట చేతనేగదా? యజ్ఞానాంధకారమున గృంగి కృశించు సాంఘికులకొక దారియుఁ దెన్నును లేకపోయినది. వారి యభివృద్ధికించుక పాటుపడినచో సంఘమునకీ పాట్లుండెడివి కావుగదా? కనుకనే?

గీ. చదువ వ్రాయను నేర్వమి । సంఘజనులు
కడుపుకొక యింత గంజియు । కట్టుకొనఁగ
బట్టయు నులేక నీచంపు । బనులు సేయఁ
బాలుపడుచుండి రక్కటా । ప్రాలుమాలి?

రంగ—అందుకు మనమేమి చేయుదుము. అది దైవచిత్తము.

చిదం—దైవచిత్త మగుటచేతనే ధనవంతులగుటయు, దరిద్రులగుటయు సంభవించును. లేనివారి కున్నవారు సాయపడుట ధర్మము. ఇప్పుడు మన సంఘము విద్యావిషయమున వెనుకఁబడి దురాచారముల మునింగి దైన్యస్థితియందుంటఁగాంచి సంఘమునకొక నూతనోత్తేజమును గూర్పఁ గోరెడు మహనీయులు, ధీశక్తివిశాలురు అత్యంత దీక్షతో తమశక్తిని ధారవోసి పాటుపడుచున్నారు. వారి యుద్యమము చాలశ్రమతో వ్యయముతో గూడినది. ఇట్టి తరుణమున మీరుఁగూడ నీ యుద్యమమును ప్రోత్సహించి యించుక చేయూత నీయవలసియున్నది.

రంగ—నీవు లోకానుభవములేని పసివాఁడవు. అట్టివారితో జోక్యముఁ గలుగఁజేసి కొనుట చాల భారమైనసంగతి.

చిదం—భరించగలుగునపుడు భారమేమున్నది. లోకోపకార పరా

యను లెందరో తమ సర్వస్వము దేశారాధనమున కొసంగి త్యాగమూర్తులైరి. మీరట్టిది చేయనక్కఱలేదు. యోపినంత వఱకు సంఘసేవఁ జేయుట కీర్తిదాయకము. పరుల కుపకారము చేయలేని యీధనమెందుకు ? మనమెందుకు ?

గీ. దానమొసఁగని లోభియా । ధనికుకన్న
త్యాగియా నిర్ధనుఁడు మేలు । ధాత్రిపైని
సిరిగలిగి సంఘమరయని । నరునికన్న
మేదిని కులంబు ప్రేమించు పేద మేలు.

అదియును గాక.

గీ. ధనము విద్యయుగలిగిన । మనుజుఁడెలమి
ఆత్మ సంఘాభివృద్ధితా । నరయదేని
కాల్పనే వానిధనము । జగంబునందు
పెద్దలగు మీకు తెలియని । విషయమెద్ది ?

రంగ—సరి, సరి. యికనేమి మంచి యితిహాసములలోనికే దిగితివి.

చిదం—ఇతిహాసముల కేమున్నది. ఇష్టముతో గూడినపని.

రంగ—అవునుగాని నాకు వృధావ్యయములన్న మనస్కరించదు. గాని సంఘ ప్రచార వృత్తాంతములసంగతి విని పరిస్థితులను బట్టి సాయము చేయు తలంపుతో దాని వివరములను గూర్చి మన దురోదరు నడుగగా నాతఁడా ప్రచారము బూటకమనియు పనిచేయువారు కపటవర్తనులనియు నుడివినాడు. దానిపైని నాయభిప్రాయము మార్చుకొంటిని.

చిదం—(ఇంచుకంత కోపము నభినయించి) యథార్థమును తెలిసికొనుట కితరులపై నాధారపడుట మొదులకు. అందునను మన దురోదరుని విషయమై చాల జాగ్రతగనుండవలయును. అతని ప్రవర్తన చాల యవకతవకగ నున్నది. అతఁడనేక

దుష్కృత్యములను గావించుచున్నాడు.

రంగ—ఆలాగునా ?

చిదం—అవును. మీరుకూడ నాతని తంత్రములకు లోనై వృథా వ్యయము లెన్నియో చేయుచున్నారు. అవి మెప్పునకుఁగాని మేలునుఁగోరి గాదు. మిత్రద్రోహులకు, సంఘద్రోహులకు ధనము వందలాది వెచ్చించుచున్నా రలేగాని దిక్కులేక దీనావస్థలందుచున్న పేదల నిమిత్తముగాని, బీదవిద్యార్థులకు గాని యొక్కపైస వెచ్చించుటలేదు, పదిమంది కుపకరించు నుద్యమమును ప్రోత్సహించుట వృథావ్యయమో, పరమ ద్రోహులగు దుండగీండ్రను, బ్రోత్సహించుట వృథా వ్యయమో యూహింపుఁడు. దురోదరుని నిరంకుశ దుర్వర్తనకు మీరూతకట్టుయునిగూడ యనేకులుతలంచుచున్నారుచూడుడు.

సీ. మంచిది చెడుగుగా । మార్చి చెప్పెడివారి
కల్లలే వేదవాక్య । ములుగాక
ధరకునింగికిని సూ । త్రంబు బన్నెడి
కొండెగాండ్రెసమ్మెు చెవి । కాండ్రుగాగ
తలలుమార్చియు విరో । ధములు పెట్టెడివారి
ఘనతయే యూనిక్క । కంబుగాగ
గవ్వకైనను నష్ట । నా చేయిజొనిపెడి
జాల్ములే ధర్మవాచ । కులుగాగ

గీ. ఉండిరంగయ్యగారు బా । గోగులైన
వినమునుగూడ నెవరల । పోసికొనక
యున్నవారని లోకులె । న్నన్నొవిధుల
చెప్పుకొనుచున్నవార లీ । చెడుగువినరె ?

రంగ—ఎవరా తలంచువారు. అయినను దురోదరుఁ డేమిచేయు

చున్నాడు. అతఁడు చాలమంచివానివలె నుండునే?

చిదం—అదియే వానిదగ్గరనున్న గొప్పతనము. పయోముఖవిషకుంభమగు నతని ప్రవర్తనయే తమవంటివారి ప్రాపకమునకు గారణము.

రంగ—సరే? యిప్పుడా విషయమెందుకు. ఖడ్గనారాయణసెట్టిగారి యుద్యమమును గొనసాగించుటయే గదా నీయాశయము.

చిదం—అవును. నా కంతకన్న వాంఛనీయ మొండులేదు.

రంగ—అట్లయిన మంచిది. (అటుచూచి) అదిగో దురోధనుఁడు గూడ నిటే వచ్చుచున్నాడు. వారితో మరల నీవిషయమును గూర్చి ప్రసంగింతును.

(ప్రవేశము—దురోధనుఁడు)

రంగ—అయ్యా! ఇటు దయచేయుఁడు.

చిదం—(తనలో) ఔరా? ప్రపంచములో నెందఱపూర్వచాణక్యలున్నా.

దురో—(తనలో) తండ్రిగారికి నీతఁడేదో యుపదేశము చేయుచున్నట్లున్నాడు. ఏమి చెప్పియుండును చెపుమా? (ఆలోచించి) ఏమున్నది. అసంబద్ధప్రలాపముల సంఘప్రచారపువంగతులు. ఈ కట్టుకుంకగూడ వారితో చేరి ఏదో వెట్టి వెట్టి వేషములు వేయుచున్నాడు. ఉద్యమమును ప్రోత్సహించవలసినదగాగాబోలు నిప్పుడీతఁడు చేయుచున్న యుపన్యాసము. కానిమ్ము; ఎట్లయినను ప్రచారమును సాగనీయకుండ చేయుటయే నేను చేయవలసినపని. నా మాట కడుగుదాటని యీ రంగయ్యగారు పుత్త్రుఁడు చెప్పినంతమాత్రమున విననేడు. ఇతని కెట్లో యేవగింపు గలిగించి తనయుని మందలింపఁజేసితినా మిగిలిన పని సునాయాసముగ నెరవేర్పఁగలను. దానికి తగిన ప్రయ

త్నమంతయు నిదివరకొకమారు చేసియే యుంటిని. (రంగయ్య గారివంకతిరిగి నవ్వుచు) ఏదో అబ్బాయిగారును మీరును ఆలోచించుచున్నట్లున్నారు.

చిదం—అబ్బా! ఎంతప్రేమ—

రంగ—ఆలోచించుటకే మున్నది. అబ్బాయి ఖడ్గనారాయణసెట్టి గారి యుదంత మెఱింగించుచున్నాఁడు.

దురో—మీ రదివరకెఱుఁగరా?

రంగ—ఎఱుఁగకేమి. మున్న మీ రెఱింగించిన దానికిని అబ్బాయి చెప్పుదానికిని చాలవ్యత్యాసమున్నది.

దురో—ఏమిటా వ్యత్యాసము.

రంగ—మీరుకాదని—వారగునని.

దురో—ఏవిషయమున.

రంగ—ఖడ్గనారాయణుని ప్రచారవిషయమున.

దురో—ఏ మని.

రంగ—వారు గాఢసంఘాభిమానులని.

దురో—అట్లా! అభిమానమా? అవును. దురభిమానము.

రంగ—ఎవరికి

దురో—తాము సెలవిచ్చినవారికే?

రంగ—ఎట్లు చెప్పగలరు.

దురో—వారుచేయు దుర్బోధలకు, ద్రోహములకు, అయ్యా! ఇటు వినుఁడు. నీ ప్రచారములన్నియు పనిపాటలులేక—తినికూర్చుండలేక చేయుపనులుగాని—నిజముగా సంఘాభివృద్ధికొరకా? మహామహు లెందరో దేశముకొరకని కారాగారముల మాడు చున్న దిక్కులేదుగాని యీపిల్లకాకుల సంఘసౌభాగ్యయత్నములా సఫలీకృతములు. యివన్నియు పటిబూటకములని

ముమ్మాటికి నమ్మెడు.

చిదం—(కోపము నభినయించి) ఏమి? నీవాగాడంబరము. ఓరి సంఘ ద్రోహి మూర్ఖుడా! ఏమి ప్రేలుచున్నావు. నీ యట్టి స్వార్థ పరాయణులు, నీ చాతిసీచులు. అసూయాపిశాచముల మూల మునవే సంఘమున కిట్టిదుర్గతి ప్రాప్తించినది. నీ వంటి కృతం త్రులు, నీతిబాహ్యులు బుద్ధిహీనులు జన్మించిన కారణము చేతనే సెట్టిబలిజరాజ్యలక్ష్మి యస్తమించినది. నీవంటి విశ్వాస హీనులను ప్రోచుట విషవృక్షములను పెంచుట వంటిది.

నీ చాధమా? చేయుట చేతగాదు సరిగదా నిష్కళంకహృద యులగు సంఘాభిమానులపైన విశ్వాసముం గొల్పు నీచోపదేశము లను గూడ గావింపుచుంటివా? చూచితివా నీ మూలమున యెందఱు దిక్కుమొక్కులేక యల్లాడుచున్నారో- ఉపకారమును పొందవలసిన చాలమంది—అభివృద్ధిం గాంచవలసిన యనేకులు నీ మూలమునం గడ గండ్లపాలై యధోగతింబడి యల్లాడుచున్నారు. నీవు కూల్చిన కొంపలు లెక్కించుకొనుము. నీవుచేసిన యపకారములను గణించుము. నీ శ్రేయ స్సు, నీ గొప్పతనము, నీ గౌరవము, నీ యభివృద్ధియే గానిపరాభి వృద్ధిని గాంచి సహింపలేని పాపివి. అన్నములో సున్నముం వేయు ద్రోహివి. తులువా! నీ తాతసొమ్మైన వెచ్చించుచుంటివా? ఇచ్చుచుంటివా? నీ కింతయేడు పెందుకు! సంఘాభివృద్ధిని గాంచి, దానికిం బాటుపడు పావనమూర్తులం జూచి సహింపలేనిచో కంఠ మున కురిపోసుకొని చావుము.

జడమతీ! పరనిందాపరాయణా! మంచికొఱకు నీ వేడ్చిన దెప్పుడు. అభివృద్ధి గాంచువారిని గాంచి నీవానందించిన దెప్పుడు? పరులు నీ కంటికి తృణప్రాయులు. పరహితము నీ కసహ్యము. నీవు చేసిన దుష్కార్యములు, అన్యాయములు, సాధుజనులకు, నిరుపేదలకు

ఆశ్రితులకు, నీవు గావించిన యపకారములు, నమ్మించి చేసిన ద్రోహములు, కపటవర్తనములు, నిన్ను కట్టికుడుపకపోవు.

దేనిచే గొప్పవాఁడనని విఱ్ఱవీగుచున్నావో, దేనిచే లోకమును భ్రమింపఁజేయుచున్నావో, దేనిచే మంచివానివలె గౌరవింపఁబడుచున్నావో, యట్టి నీ కపటవర్తనమే, నీ యధోగతికి, నీ యంత్యమునకు, దారి చూపకపోదు. తుదకైనను పశ్చాత్తప్తుడవుగాకపోవు.

ఓసీ! కపటనటనాధురీణా! నీవీ తావును వీడి తక్షణము అవలకుఁ బొమ్ము. లేదా? కార్యము మీరగలదు.

రంగ—నాయనా! ఏమీ తొందర. (దురోదరునివంక తిరిగి) స్వామీ! కుఱ్ఱవాఁడు. అతని కేమి తెలియును. నేనుమందలించెదనులెండు

దురో—(వికటముగ నవ్వి) చిన్నతనపు చేష్టలు. చిన్నతనపు చేష్టలు.

(రంగయ్యగారివైపు తిరిగి) సెలవు గైకొందును.

(నిష్క్రమించును)

రంగ—వెళ్ళిరండు.

చిరం—(తనలో) శని విరుగడయ్యెనది.

రంగ—నాయనా! తొందరపడి పెద్దలనట్లు దూరదగునా! ఒకవేళ కార్యాకార్యము లెట్లున్నను, యించుక నిదానించి మాట్లాడుట మంచిది. పరులెట్టివారైనను వారి మనస్సు పరికింపనట్లు, పరుషవాక్యము లాడవచ్చునా!—సరే నీవు లోనికేగుము. యుద్యమమునకు తగిన ధనమిత్తును.

చిరం—నాకదియే కావలయును (నిష్క్రమించును)

రంగ—కుఱ్ఱవాడు మొగముచూడని మాటలన్నందుల కాతఁడు చాల విచారించి యుండును. నేనుకూడ మౌనముదాల్చితి నదేమి పాపమో! భావిస్థితి యెట్లుండునోగదా?

(నిష్క్రమించును)

---

# సెట్టిబలిజసంఘసేవ

## తృతీయాంకము

### 1. దృశ్యము

ప్రదేశము—దురోదరుని గృహము

(ప్రవేశము—దురోదరుడు (విచారము నభినయించుచు)

దురో—

చ. వెనుకయు ముందులేక నవి । వేగుచు చేతల నిచ, ద్రోహి, యం
చనినను నోటి విప్పుటకె యు । క్కుఁబు రాదు యోఁ పాపకార్యముల్
పొనరుచు వారి డెందమును । పాతకము శపథమెన్నఁ జేసియున్
ఘనులను దూఱువాఁ డఘము । గాంచక పోవుట యెట్లు తలింతకున్.

ఆహా? ఏమిది! అప్రయత్నముగ నెన్నఁడు రాని మాటలు నానోటినుండి వెలువడుచున్నవి. ఘనులను, గురులను, పాపము, పుణ్యము, నన్ను నేమి చేయఁగలవు. (నదాలోచించి, యించుక తలపంకించి, యించుక దీనవదనుఁడై) నిజముగా నింత దౌర్భాగ్యపు పీనుఁగును నే నెన్నఁడును గాలేను. దుర్ఘటములగు వ్యాపారములు వచ్చినపుడైన నిట్టి పరాభవము పొందలేదు. జగత్తును వంచింపగల నామోసముల నింతవరకు మోసములుగా గణించినవారే లేరు. నా కపటవర్తనమే, ప్రేమవర్తనగా గణనకెక్కిన నాకీ పరిభవము కలిగినదని విన్న ప్రజలలో నెట్లు తల త్రిప్పుకొందును. ఎట్టి యన్యాయములనైనను, నెట్టి యక్రమములనైనను నపి సమర్థించుకోఁగల జ్ఞానమును సర్వేశ్వరుఁడు నాకు ప్రసాదించినాఁడు. కాని యొక్క క్షణములో నా కుట్రకుంకచే హృదయస్ఫుటభేదన మొనరించు కఠినతర పరుషవాక్య పరంపరలచే నాహృదయము, ఈ హృదయము, ప్రత్యవ

యువము తూట్లు పడిపోయినది. అబ్బా! చాల భారముగ తోచు చున్నది. ఏమిది! పిరికితనమా? (కోపము నభినయించి) భయమా, అవలకుఁ బొమ్ము. దురోదరసార్థకనామధేయుఁడగు నా దృఢచిత్తుని యింత నిర్భయముగా, నిశ్చింతగా యేల చేరెదవు. నా చేతులార, మనసార, గావించిన దాక్షిణ్యరహిత క్రూరకార్యములవల్ల నయిన చలించి యెరుగని నామనస్సు, కఠినపాషాణాన్వితమగు నా హృదయము యీ యవమానమును భరించుట భారమని కాఁబోలు భయపడు చున్నది. ఛీ! ఏటిభయము! ఏటి యవమానము. క్రమానుసరణి వచ్చుచుఁ బోవుచునుండు భ్రమణమునకు వగచుట వెఱ్ఱిపని. (కోప ముతో) కాని, ఈ చండాలుర!

గీ. చలముగొని యెట్టులైనను । బలిమినైన
పొంచి ప్రేమించి వెన్నంటి । మంచిమంచి
పల్కులవచించి సమయ మా । వంతఁ జూచి
ప్రాణములదీయకున్న నా । బ్రదు కదేల?

చూచెదగాక! నాకంఠమున జీవమున్నచో నీయుద్యమము కూకటివ్రేళ్లతో నిర్మూలము సేయకుందునే,

గీ. ఉర్వి ఋణశత్రుయున్మ్న నెపుడు । నుంచరాదు
అనెడు పెద్దలవాక్యము ల । హాహా చూడ
వేదవాక్కులుగా వాకో! । వీని నణఁచ
కున్న నాపేరు సార్థత । నొందు టెట్లు?

(అటునిటుచూచి) అదుగో చక్రపాణిసెట్టి యిటే వచ్చుచున్నవాఁడు. నా పదభ్రష్టత్వపుసంగతి నాతనికి తెలియనీయరాదు. నాటి యుదంతము మామువ్వురకును భగవంతునకును దప్ప బ్రహ్మాండ నాయకుఁ డెఱుఁగడు. ఈ విషయము కడురహస్యముగ నుంచి కార ణాంతరములచే సందుండి విరమించినట్లు మాత్రము చెప్పవలయును.

(ప్రకాశముగా) మిత్రమా? వెదుక బోయిన తీగ కాళ్ళఁబడినట్లు మీరే యిటువచ్చితిరి. తమ కొఱకు రావలయునను ప్రయత్నమున నుంటిని.

చక్ర—నాపని యేమివచ్చినది.

దురో— సరి! మీపనియేమిటా! అంతయు మీలోనేయున్నది. దానికేమి గాని నేనీమధ్య రంగయ్యగారి పనినుండి మానుకొంటిని. ఆసంగతి మీకు తెలిసినదా?

చక్ర—తెలియదు. కారణమేమి?

దురో—కారణమేమియును లేదు. పనిచేయుటకు యిష్టములేక. అగి యునుగాక వెనుక మనమనుకొనిన కార్యము సాగించుటకు.

చక్ర—(ఆకసమువంక నేలవంక చూచును)

దురో—ఏమి? పైకి చూచుచున్నారు. జ్ఞాపకములేదా?

చక్ర—ఏమిటది.

దురో—మాట మరచితిరన్నమాట! ఖడ్గనారాయణ...

చక్ర—ఓ! పకము వచ్చినది. అందులకని పని మానుకొంటిరా!

దురో—మానుకొన్నగాని— మాటదక్కునట్లు గాన్పించినది కాదు.

చక్ర—అందుకని యిప్పుడు చేయవలసినదేమున్నది?

దురో—కావలసినంత—ప్రచారమును ఖండించుచు, ప్రజల కేవగింపు గలిగించి, రహస్య పరిశోధనలచే యద్దానినిభగ్నపర్చవలయును.

చక్ర—దానికి లోటేమున్నది. మనచేతిలో కావలసినంత బలఁగ మున్నది. వారి కాజ్ఞ యిచ్చితిమా అరఘడియలో నార్పివేయఁ గలరు.

దురో—మంచిది. ఆపనివిషయములో నట్లు చేయవచ్చును. రంగ నాథపురమున సంఘసభయని ప్రకటించబడినది. గాని దాని వివరములింకను బయల్పడలేదు. అక్కడకు చిదంబరసెటి, ఖడ్గ

నారాయణ, పురుషోత్తములు తప్పకవచ్చి యుపన్యసింతురు. అవి జరుగకుండ తగిన యెల్లరిమూకల వెంటఁ బెట్టుకొని యేగి సభ పాడుచేయవలయును. ఎంత తెలివితేటలగ వర్తించిన నంతమంచిది. నేనుమాత్రము వారితో కలసి పనిచేయు వానివలెనే నటించుచు తగుణమును బట్టి వ్యవహరింతును. ఈ కార్యమును జయప్రదముగ సాగించుభారము మీభుజములపై నిడితిని. ప్రవర్తనయందు, పనులయందు, దురోదర యింపొందఁ డనిపించుకొనుచు మన యుభయుల కీర్తియుఁ గాపాడ వలయును. నీటముంచినను, పాలముంచినను నీదే భారము.

చక్ర—ఈ విషయమున యించుకంతయు మీరు సందియపడనక్కర లేదు. మీయాజ్ఞ శిరసావహించి పనిచేయుదును.

దురో—మంచిది (అటుచూచి) అదుగో ఖడ్గనారాయణసెట్టి యిటు వచ్చుచున్నాడు. మీరీదారిని పొండు—

(చక్రపాణి నిష్క్రమించును.)

(ప్రవేశము—ఖడ్గనారాయణసెట్టి)

దురో—మహానుభావా! సంఘాభ్యుదయమునకై పాటుపడుచున్న మీసాహాయ్యకయమున కిదే నమస్కారము.

ఖడ్గ—ఆవిషయమున మాకుఁ జేదోడు వాదోడుగాఁ బనిచేయు మీకు కృతజ్ఞతాపూర్వక వందనములు.

దురో—ఆర్యా! మిమ్ము నిరంతరము స్మరించుచు, తమసేవఁ గొని యాడుచు, నే బొందు సంతసము నేమని చెప్పను. భగవంతుఁడు మిమ్ము చిరాయుష్మంతులను జేయుఁగాత యని ప్రార్థించుచుందును.

ఖడ్గ—ఈ యనురాగమే మా యందుంచి రేపటిసభకు మీరు దయ చేయవలయును. కార్యభారమంతయు మీరే వహించి సభ

జయప్రదముగా జరిగించవలయును.

దుర్గో—సరి, సరి, యింతమాత్రపు భాగ్యమునకు మీరు చెప్పవల యునా ? తప్పకశక్తి వంచనలేకుండ పనిచేయుదును.

ఖడ్గ—అదియే మేము వాంఛించునది.

దుర్గో—ఇట్టి కార్యములన్న, యవి జరుపువారన్న, నాకు చాలయా నందము.

ఖడ్గ—అంత దయయున్నఁ జాలు.

దుర్గో—దయ కేమిగాని! స్నేహితుఁడా! తనుకొంకహితముఁ జెప్పదల చితిని ?

ఖడ్గ—మహాప్రసాదము.

దుర్గో—ఉద్యమాభివృద్ధినిగాంచి, సహించలేని యొందఱో దుండగీం డ్రు, మీ ప్రయత్నములకు కంతరాయములు గల్గించు సూచ నలు గానవచ్చుచున్నవి. పైకి శ్రీరంగనీతులఁ జెప్పువారలే యిట్టి పనులకు పాల్గొనువారలు.

చ. సరసులు మంచికార్యముల । సల్పెడు పట్టున నంతరాయముల్
కరముపొనర్ప దుర్జనులు । గాఢము లౌ యతనంబులెన్నియో
మురియుచు చేయుచుందురల । మూర్ఖులమాయలఁ జిక్కకుండఁగన్
వెరవున నెట్టులుండెదొ వి । వేకము కోవిదుత ప్రాణమిత్రమా ?

ఖడ్గ—పెద్దల యాశీర్వచన ఫలమున్న కార్యములు నిర్విఘ్నములు గాగలవు.

దుర్గో—సరిసరి, యొంతమాట—అవశ్యము కావలసినదదియే (తనలో) నే నిప్పుడే చక్రపాణి మున్నగు యువకులను సభకుపోవుటకా యత్తము చేయవలయును (ప్రకాశముగా) నే నీ సమీపగ్రామమునకుపోయి సభావృత్తాంతములను దెల్పి యొక గడి యలో యింటికి వత్తును. మీరు మా యింటికి దయచేయుఁడు.

5

ఖడ్గ—చిత్తము. (నిష్క్రమించును)

ఖడ్గ—ఇప్పుడింకను మధ్యాహ్నము కాలేదు. ఇంతలోనే నీప్రాంతమున నున్న సెట్టిబలిజల యిండ్లకుపోయి కొంత ప్రబోధమును సాగించెదను.—(పరిక్రమించి) అదుగో కనుచూపుమేరలో గాన్పించునవి తాటియాకులయిండ్లు వలెనున్నవి. ఆ—పోగపడితిని. పొలములయందు గృహములుండునా! అవి యిండ్లు కావు. బెల్లమువండు పాకలు. ఆహా! నిజముగా నీ నీచవృత్తియు, నీ దీనమానవ సమూహమును తలంపునకువచ్చినపుడెల్ల గుండెలు ఝల్లుమనును.

సీ. ఉసురులుండునో । యూడునో గణింపకలోన
చెట్లు ప్రాకెడివారి । స్థితినిగన్న
నొడలు దహించెడి । వడగాడ్పులో
చానలొందెడి యగ । చాట్లగనిన
దారిద్ర్యమునఁ దోగి । తంటాలు పడువారి
ముద్దు బిడ్డల వెత । మోముగన్న
చలమునఁ బరుల । చేతలకు ఘాతలకెల్ల
వెక్కస పడువారి । విధముగన్న.

గీ. కఠిన పాషాణమైనను । కరఁగకున్నె?
అట్టివో సెట్టిబలిజల । యందుఁ బుట్టి
నట్టి వార లెవరుగాని । యక్కటకట
ఎట్లసహింతురె తమవారి । యిడుమ లరసి!

దీనిని సాధ్యమైనంత త్వరలో నూచముట్టుగా నిర్మూలించ ప్రయత్నించవలయును (ముందునకువచ్చి) ఈ సమీపమున నెవరో పిల్లవాడు తిరుగుచున్నాడు. సమీపించి యిక్కడ విషయములు తెలిసికొందును. (సమీపించి) అబ్బాయీ! మీరెవ్వరు.

బాలు——సెట్టిబలిజీలము.

ఖడ్గ——అట్లనా! నీపేరు.

బాలు——నారాయుడు.

ఖడ్గ——అయితేగాని నారాయణా! నీవు చదువుకొన్నావా!

బాలు——మూడోక్లాసు వరకూ చదువుకొన్నాను.

ఖడ——మరి యిప్పుడేమి చేయుచున్నావు.

బాలు——దూడలను గాయుచున్నాను.

ఖడ్గ——చదువు సరిపోయినదా యేమి?

బాలు——పద్దులు వ్రాయడంమట్టుకు వచ్చిందని మా తండ్రిగారు చదువు మాన్పించినారు.

ఖడ్గ——మీకు యేమాత్రం పొలంవున్నది.

బాలు——అయిదు యెకరములు.

ఖడ్గ——ఇకనే! ఇంకను చదువుకొనలేకపోతివా?

బాలు——నాకు చదువుకోవాలనే వుండేదండి. మా నాయన "మనకు చదువెందుకురా ఉద్యోగాలు చేస్తామా! ఊళ్లు యేలుతామా! పాలేరును పెడితే పదికుంచముల ధాన్యం యివ్వాలి నెలకు, దూడలను కాస్తే అవి మనకే మిగులుతవి అని పంతులుగారు చదివించమని చెబుతున్నా బలవంతంగా బడి మాన్పించారు.

ఖడ్గ——మరల మీతండ్రిగారు చదువు కొమ్మంటే చదువుకుందువా.

బాలు——చదువుకుంటానండి. యీదూడలను గాయలేక చస్తున్నాను.

ఖడ్గ——సరే. నేను మీతండ్రిగారితో చెప్పెదను. కాని దుర్యోదరుడు గారి నెరుగుదువా?

బాలు——ఎరుగుదునండి——మాకు దగ్గరవారే?

ఖడ్గ——అట్లనా! వారు మన సంఘమువారికి చాల సాయముచేయు చుందురని విందును.

బాలు—అదివక్కటే లోటండి అభివృద్ధికి వచ్చేవారిని అడ్డుపెట్టకుంటే సాయము చేసినంతఫలమండి. ఆయన మాహోపాధ్యాయులుచేతనే యిక్కడ మనవారు పూటకుగతిలేక గర్భదరిద్రులై యున్నారు. వారందఱు తనక్రింద భానిసలుగ నుండాలని వారి తలంపండి.

ఖడ్గ—సరిలే ఆసంగతి మనకెందులకు? (తనలో) సంఘాభిమానులనుకొనువారు పెక్కండ్రు స్వార్థపరులగుటచేతను, కుతంత్రులగుటచేతనే సంఘమిట్టి స్థితియందున్నది. (ప్రకాశముగా) ఈకాగితమును మీతండ్రిగారికిచ్చి మీగ్రామములోనున్న మనవారందరికి అందునట్లు యేర్పాటుచేయుము. మీతండ్రిగారితో పాటు మీరుకూడ రేపటి సభకురండు. విషయములన్నియు నక్కడ మాట్లాడుదము. నేను ప్రస్తుతము దురోదరుడుగారి యింటికి వెళ్లి అక్కడ పనిచూచుకొందును.

బాలు—చిత్తము (నమస్కరించును)

(ఖడ్గ— నిష్క్రమించును)

౨ వ దృశ్యము.

(ప్రవేశము— సుమతి)

సుమ—నా తండ్రిగారిప్పుడింటలేరు. ఖడ్గనారాయణసెట్టి యింటదే కలడు. వారితో ముచ్చటించుటకిదే మంచితరుణము. (కొంచెము సమీపించి వెనుకకుతగ్గి) ఎట్లు సమీపింతును. ఏమని ప్రశ్నింతును. అట్లనుకొననేల, ఎందుకు మాట్లాడరాదు. మాట్లాడుటయే గాదు. మనోరథమునుగూడ వెల్లడింపవలయును. వెల్లడించిన ఎట్లు భావించునో! ఏమనునో!—పోయి మాట్లాడెదను.

ఖడ్గ—తమ నామధేయము.

సుమ—సుమతి యందురు.

ఖడ్గ—(తనలో) ఈ సుందరా కారమున కీ సుమతి నామధేయ మెం తయు తగియున్నది. (ప్రకాశముగా) యిం దేమి పనిగలిగి వచ్చితిరి ?

సుమ—కొంచెము పనియుండి (మనము తొందరపడకుము) తమ యుద్యమము నిర్విఘ్నముగ కొనసాగుచున్నదా!

ఖడ్గ—భగవదనుగ్రహముచే నదొకవిధముగ కొనసాగుచున్నది.

సుమ—పరిస్థితు లెట్లున్నవి.

ఖడ్గ—ఇట్లున్నవని చెప్పుటకు వీలులేనంత దుస్థితియందున్నవి. ఏమం దురా ?

సీ. సంఘదుస్థితికన్నె । సంతాపమున్నట్లు
నటియించి పనచేయ । నట్టివారు
కలిగియు విద్యలం । గఱపక బిడ్డల
నజ్ఞానులుగ చేయు । నట్టివారు

కడుహేయమై ప్రజా । కంటకంబౌ నీచ
మద్యవిక్రయమున । మసలువారు.
చేయగాలేక । చేసెడివారి దంచేరి
చెడుబోధనంబులు । చేయువారు.
గీ. కడుదురాచారములు గ్రుంగి । క్రాలువారు
కాలమానరయక తమమేలె । గోరువార
లిట్టులున్నార లెందరో । నింకనక్క-
డక్కడా కతిద్ద రెవ్వరో । డక్క సుమతీ!

సుమ—కుతంత్రులు నీతి బాహ్యుల మూలమునసే సంఘమున కిట్టియ
డ్డంకులు యనర్థకములు ప్రాప్తించుచున్నవి. అయినను
గీ. ఏద యెట్లైనగాని । మీకేమి దేవు
మొగము జూచి బీదజనుల । మొగము జూచి
కార్యముల్ సల్పెదరుగాక । కానివారి
తోడ మీకేలనో! మొగ । మోడబుచ్చ!

ఖడ్గ—(తనలో) ఈమె వయిస్సున పిన్నయయ్యు ప్రాజ్ఞురాలి తెలం
గున హితముం గరిపుచున్నది. ఈమె మాటలయం దమృతపు
ధారలుట్టిపడుచున్నవి. ఈమె బాగుగా చదివిన బాలామణి
యని వేరుగా చెప్పనక్కరలేదు. స్వసంఘాభిమానమేగాక
సహజధైర్యసాసహము లీమెయందు స్పష్టముగ గోచరించు
చున్నవి. స్త్రీలుకూడ నింతమంచి స్థితికి వచ్చినచో సంతతి
బాగుపడి సంఘ మచిరకాలముననే యభివృద్ధిగాంచుట కవ
కాశముండును. యీమెనింకను ప్రశ్నించి చూచెదను.
(ప్రకాశముగా) సంఘదైన్య స్థితికి విద్యావిహీనతయే కారణ
మందురా?

సుమ—అదియొక ముఖ్యకారణమని చెప్పవచ్చును. గాని యీ సంఘ

మును నాశనముగావించి వేఱు పురుపుచందమున తొలచి వేయుచున్నది. నీచత్వమును నిరూపించుచున్నది, కులవృత్తి యని నా నమ్మకము. మహాభయంకరమైన, నీచభూయిష్ఠమైన, నిందాగర్భితమైన, గౌరవహీనమైన, యీ నికృష్టవృత్తి మాయమైనగాని జాతిగౌరవము స్థిరస్థాయిగా నిలువజాలదు. దీనిమూలమున భావిసంతతికూడ పాడగుచున్నది.

ఖడ్గ—(తనలో) ఈమె సంఘమునకున్న మూలాధిష్ఠమును గ్రహించ గలుగుట మహాభాగ్యము. ఈ పాటి సూక్ష్మబుద్ధితో నీ సూత్రము మెఱింగినవారు చాల తక్కువయని చెప్పవచ్చును. (ప్రకాశముగా) మీ యభిప్రాయము చాల బాగున్నది. ఆ పద్ధతులపైననే ప్రచారము జరుగుచున్నది,

సుమ—విద్యార్థుల సంగతి ఎట్లున్నది.

ఖడ్గ—అనేకులకిదియే యింపుకంటె సుత్సాహకరముగా నున్నది. చదువునేర్చిన ప్రతి యువకునకును సంఘదుస్థితి విచారకరముగ నేయున్నది.

సుమ—విద్యార్థులుగాక, ధనికులలోను, పెద్దలయందును.

ఖడ్గ—ప్రస్తుతము మా సంఘమున ప్రోత్సాహకులలో పెక్కండ్రు ధనికులు—విద్యావంతులే అందు మీ తండ్రిగా రొకరు.

సుమ—(తనలో) నా జనకుని కపటవర్తన మీమహనీయుడు ఱెఱింగి యుండడు. మా తండ్రిగారి నటనగాంచి సంఘాభిమానమని భ్రమించుచున్నారు కాబోలు పాపము.

ఖడ్గ—బాలామణీ! తామును కూడ సంఘాభివృద్ధినిగూర్చి చాల శ్రద్ధ వహించితిరని తలంతును.

సుమ—తమవలె ప్రజాసేవజేయుటకు నోచుకొన్నదానైతినిగదా!

ఖడ్గ—భగవదనుగ్రహముచే నట్టి యవకాశము గలుగుగాక!

సుమ—తమ వెనువెంట సంఘసేవఁ జేయు భాగ్యము ప్రసాదించవలసి నదిగా భగవంతు నారాధించుచున్నాను.

ఖడ్గ—(తనలో) ఈమె యుద్దేశము తెలిసినది (ప్రకాశముగా) పురుషులవలె స్త్రీలుకూడ సంఘప్రచారమున కుపక్రమించుట ధర్మమను వారిలో ప్రథముఁడను నేను. గాని మీ జననీజనకుల యనుమతి గావలయునుగదా! (వినుటనభినయించి) అదుగో మీ తండ్రిగారి యడుగులజాడ వినబడుచున్నది.

సుమ—అయిన నేను లోనికేగెదను గాన యొక మనవి.

చ. ఘనకులకత్తులందు దిగి । కాలము పీటను బుచ్చి పంతము
ల్లను నెరవేరుటయని త । లంచి బలాధికులేగు త్రోవనే
జని, కడగండ్లనుంబడు ప్ర । జల్ మొఱవెట్టుడు లేమియున్ వినన్
జననియభాగ్యదేవతల । చక్కని మాత్రముబోకు మియ్యెడన్?

(తిరిగితిరిగి చూచుచు) పునస్సందర్శనలాభంబు చేకూఱుం గాక?

(నిష్క్రమించును)

ఖడ్గ—ఈమె నిరుపమానసంఘాభిమాన మెంతయు ప్రశంసాపాత్రమని చెప్పవలసియున్నది.

(ప్రవేశము దురోదరుఁడు.)

అయ్యా! మీకిందే యాలస్యమైనది. నేనీ సమీపగ్రామముల యందున్న మనవారి కందరకు నీ సంగతి నెరింగించి వచ్చు సరికింత యాలస్యమైనది. రేపటిదిన మందరును తప్పక దయచేయుదుమని సెలవిచ్చిరి. రండు పోదము.

(నిష్క్రమింతురు)

8 వ దృశ్యము

(ప్రవేశము—శాలయ్య)

(తనలో) అబ్బబ్బా! ఏమిసంఘం, ఏమిలోకం. ఇది వచ్చిన తరువాత మీటింగులని ట్రావిలింగులని చందాలని—చట్టుబండలని—వకటా—లక్షా తొంభై వచ్చాయి. ఈ కాకిపిండాలంతా కడతేరిందా అంటే—యింట్లో వాళ్ళను వీధిలోను, వీధిలో వాళ్ళను యింట్లోనూ—వుండకుండా—అవతలకీ యివతలకీ యీడ్చి పారవేస్తుంది—పత్రికలటా వచ్చి—ఇన్ని సంవత్సరాలనుంచీ—ఎల్లాగో—రేపాయిస్తాను—మాపాయిస్తానని జరుపుకొస్తూ—గౌరవంగా—పెద్దమనిషిలాగ—కాలం గడిపాను గాని—యీసారి గత్యంతరం కనబడడంలేదు.

రామరామ—చందాకు వచ్చారన్న మాట చెవిని పడిందిమొదలు—అన్నం నోటికి పోవడంలేదు. ఏదో దొంగిలించినట్టుగా గుండెలు దడా—దడా—కొట్టుకుంటున్నాయి. ఏమీ తోచడంలేదు. ఏమి చెయ్యడానికి పాలుపోవడంలేదు.

దీనితస్సాగొయ్యాలి ప్రపంచం—అన్నీ తంటాలుగానే వున్నాయి. డబ్బువుంటే వకచిక్కు లేకపోతే వకచిక్కు. ఏదో పదిఎకరాల పొలం—పదివేల రొక్కం వుంచనిన్నీ—యిసంతా తగలపెట్టాను గానసిన్నీ—లోభిముండావాడినని—లుబ్ధాగ్రేసర చక్రవర్తినని నాకు ప్రజలు యిచ్చిన పేర్లు. వీళ్ళమొగం. సంపాదించినవాడికిగాని—సంగతి సందర్భాలు—తెలియవు ఎన్ని గడ్డలుగలిపి—ఎన్నిపసుపులు ఏపిస్తే ఏడ్చింది ఇంతవరకు లోకంతో సంబంధం లేకుండా వుండాలన్నప్పటికీ—వుండనిచ్చేటట్టు లేరు ప్రజలు. దీనికితోడు కుర్రకుంక కూడా—చెప్పినమాట వినకుండా మనస్సు పాడుచేస్తావున్నాడు. ఇంగిలీసు చదవడం వచ్చాక వద్దంటే పదిసార్లు "టీ" త్రాగడం. కత్తిరిమార్కు సిగరెటు కాల్చడం—మీసాలు కత్తిరించుకోవడం—పౌడరంటించుకోవడంతో—

సరిపోతుంది కాలం—ఈ కాస్తా నాకళ్లముందే కైంకర్య మయ్యేలాగుంది వరసచూడగా (అటుచూచి) అదుగో రామస్వామికూడా యిల్లాగే వస్తాయున్నాడు. ఇతని వాలకంచూస్తే—నాస్థితే—యితనికికూడా—సంభవించినట్టు తోస్తుంది. (సమీపించి) ఓహో! రామస్వామిబావగారా—ఎక్కడనుంచి రవాణా?

రామ—ఓయి దేవుడా? కనపడ్డావోయి—సూఖంగారుగా వుంది ప్రాణం. (అమ్మయ్యా! హమ్మయ్యా! అని నిట్టూర్పువిడచును)

తాత—ఏమయ్యా! ఏమిటా ఆందోళన. (అనిగుండెలమీగ చేయి వైచును.)

రామ—ఏముందయ్యా! భోంచేసి—కాస్సేపు అటూయిటూతిరిగి—పాత చుట్టపీకకోసం—గంటసేపు వెతుక్కొని—అది కనబడిన తరువాత—పుల్లయ్యగారి యింటికివెళ్ళి వారి లాంతరున చుట్ట కాల్చుకొని—అరుగుమీద కూర్చునేసరికి—చక్కావచ్చాడు—సమను బంటోత్తులాగు.

తాత—ఎవరు?

రామ—ఏమో ఎవరో—ఈపాటికైనా యిప్పించరా! పత్రికచందా అంటూను.

తాత—ఏమన్నావు.

రామ—ఏమనను. నోట్లోనుండి మాట వచ్చిందిగాదు. ఒక్కపెట్టుకు ధైర్యం తెచ్చుకొని—యిదివరకే పంపివేస్తుమండి. ఎట్లావం పాలో తెలియక పూరుకున్నాం మళ్లారండి మాతాతయ్య బావతో ఆలోచిస్తానన్నాను.

తాత—ఓరి దౌర్భాగ్యుడా! నాపేరు ఎందుకుచెప్పావు. ఊళ్లో లేడని పించి దాటిపోదామనుకుంటుంటే. పడ్చినట్లేచేశావు. "తా చెడ్డ కోతి వనం అంతా చెరిపిందని" నీ యేమవు నీవు యేడవక

నన్నెందుకు కలిపావు. ఎట్లాబ్రతుకుతావోయి, పెద్దపెద్ద వాళ్ళతో స్నేహం చేస్తావున్నావన్నమాటేగాని ఎల్లా తప్పించుకు తిరగాలో యింతవరకు తెలిసికోనే లేకపోయ్యావు ఇంక నేర్చుకునే దెప్పుడు.

రామ—ఏం చెయ్యనయ్యా! అక్కడకు వచ్చి చెడి, సర్దుకునిసర్దుకుని ఆమాట చెప్పేసరికి నాపెద్దలు దిగివచ్చారు.

తాత—సరేలే—మంచిపనే చేశావు. ఫుల్లయ్య ఎక్కడకు పొయ్యాడు.

రామ—అదుగో—అతనూ యిలాగే వస్తాయున్నాడు.

తాత—సమయానికే వస్తాయున్నాడు. (ప్రకాశంగా) ఫుల్లయ్యా! సమాచారాలేమిటి—

ఫుల్ల—సమాచారాలూ లేవు. సంధివచనాలు లేవు. ప్రొద్దున్నించీ చద్దన్నమైనా తినకుండా వస్తున్నాను.

తాత—ఏమంత తీరికలేకుండా వున్నావు. పనిఏమిటి.

ఫుల్ల—పాటూ లేదు. బండలూ లేవు. ప్రారంభం. "చందాకువచ్చి అరుగుమీద కూర్చున్నారు యిటికి రావద్దని మావాళ్లు పొలంలోకి కబురు పంపించినారు. ఆగిఆగి—యింటికివచ్చిచూస్తే యింకా అరుగులమీదే—ఆసీనులై యున్నారు. ఇది పనిగాదని యిల్లా వచ్చాను.

తాత—అయితే—మాకంటే నీపనిలాభమే: ఈపూట చద్దన్నం మిగిలింది.

ఫుల్ల—ఏమి మిగలడమయ్యా! ఎములాళ్లలాగ దాపరించారు.

రామ—అయితేగాని—యీసంగతి ఏదో ఆలోచిస్తేనేగాని వీలుగా లేదయ్యా!

ఫుల్ల—ఏముంది. ఏపోలీసు యినస్పెక్టరుకో ఒకపిటీషను తగలెయ్యాలి.

తాత—సరి. సరి— సంఘవ్యవహారములు రచ్చకూడా ఎక్కించాలా.

ఏదో పాటుపడేవాళ్ళు పడుతుంటే—పైనుండి చూచే ప్రారబ్ధం మనకు లేకపోగా పిటీషనులుకూడానా! ఇప్పటికే మనలను తిట్టేవాళ్ళ కీసంగతి తెలిస్తే మరింత లోకువకూడాను. ఊరుకోండి—

(ప్రవేశం—చిదంబరసెట్టి).

(తనలో) ఈపిసిని గొట్టు వీరుకులు ముగ్గురూ యిక్కడకు చేరినా రేమి చెప్పుమా! మీటింగుకు పోగూడదని రాబోలు ఆలోచనము ఇటువంటి కపటి సంఘాభిమానుల కుటిలవర్తనములే సంఘము యొధోగతికి దెబ్బలవి. ఈపాపము బ్రాహ్మణ త్రయమును భగవంతుడే పదార్థముతో సృజించెనో గాని హాట్టకైనదనని దౌర్భాగ్యులు. (సమీపించుచు)

తాత—ఏమండోయి చిదంబర సెట్టిగారూ—ఎక్కడనుంచి రాక

చిదం—ఇంటి దగ్గరనుంచి—మీటింగుకు వెళ్లుచున్నాను తమరు దయ చేయరా?

తాత—అందుకనే ఆలోచిస్తున్నామండి.

చిదం—మంచిది—త్వరగా బయలు దేరండి. నేను తొందరగా పోవలయును. సెలవు దయ చేయుడు (నిష్క్రమించుచు)

తాత—చూచితిరా! కుర్రవాళ్లకు సంఘమంటే ఎంత అభిమానమో! మనంకూడా వెళదాము. ఏమంటారు.

పుల్ల—రాగానే పుంజాదిగాని—చందా యివ్వమని చంపుతారేమో

రామ—ఎందుకు చంపుతారోయ్—వెంకటిలాగే—పంపించుదామని చెప్పి తప్పించుకు వద్దాం. తిరువాత మామూలే—

తాత—మరి త్వరగా బయలు దేరి రండి—వెళదాం—

(నిష్క్రమింతురు)

(ఒకరి తరువాత నొకరు ప్రయాణమై మీటింగుకు పోదురు.)

---

# సెట్టిబలిజసంఘసేవ

## చతుర్థాంకము

### 1 దృశ్యము

ప్రదేశము—సభాస్థానము

(ప్రవేశము—కృష్ణనారాయణసెట్టి పురుషోత్తం, చిదంబరసెట్టి, చక్రపాణి మరికొందరు సభికులు. కూర్చుని యుందురు)

చిదం—

సీ. మార్గశ్రమలకోర్చి । మముచేరి ముదమిడ్డ
హితమతులార స్వా । గతము మీకు
చాల ఖర్చులుచేసి । చనుదెంచి సభగాంచు
ఘనపుణ్యులార స్వా । గతము మీకు
కరపత్రములు జూచి । యరుగుదెంచిన యట్టి
వ్రతబుధులార స్వా । గతము మీకు
పిలుపును మన్నించి । బిరబిర వచ్చిన
నీతిపాత్రులార స్వా । గతము మీకు

గీ. గర్వరాహిత్యులార స్వా । గతము మీకు
గౌరవాధికులార స్వా । గతము మీకు
కలుషవర్జితులార స్వా । గతము మీకు
కర్ణసమదాతలార స్వా । గతము మీకు.

ఖడ్గ—సోదర సోదరీమణులారా ?

ప్రతి సంఘముయొక్క అభివృద్ధికిని, ఆసంఘమునందలి కొన్ని వ్యక్తులు కారణభూతులుగా నుందురు. ఆర్యభూమియగు భారతదేశ

ప్రఖ్యాతికి శ్రీరామచంద్రమూర్తి జననము, ఆదిపర్వచారిత్రమును, నీతియుతముగా రచించిన వాల్మీకియు జగజ్జేగీయమానుండుగా విలసిల్లుచున్నారు. సంస్కృతవాఙ్మయమునకు కాళిదాసమహాకవి అపరభారతిగా ప్రతిష్ఠ గడించి యున్నాడు.

అట్లే సెట్టిబలిజసంఘాభివృద్ధికి సంఘజనులే బాధ్యులుగా నుండవలెను. ఒక్కొకసంఘ మొక్కొకకాలమున నుత్తేజిత నొందుచుండును.

నేటి సెట్టిబలిజసంఘము నభివృద్ధికి దెచ్చుటకు తగిన సమయమాసన్నమైనది. వేదకాలమున మాంసభక్షణ మొనరించిన బ్రాహ్మణులు దానిని నిషేధించి శాకాహారులై సాత్విక నాగరకతను బ్రతిష్ఠించి యున్నారు. అట్లే యొకప్పుడు తాళవృక్షమునే కల్పవృక్షముగా బట్టుకొని వెలుగొందిన మన సంఘమిప్పు డావృత్తిని విడచి అంతకంటె నుత్తమమైన సాధువృత్తి నవలంబించుట ప్రథమ సంస్కరణము.

ఈ సంస్కరణము నాచరణలోనికి బెట్టుట సులభసాధ్యము గాదు. లక్షలకొలదిగా నున్న మన వర్ణస్థులలో వేలకొలదిగా నిప్పుడీ వృత్తినవలంబించి యున్న వారికి మరియొక జీవనోపాధిని చూపవలసి యున్నది. ఇప్పుడు లేవయస్సులో నున్న బాలబాలికలకు నిర్బంధోచిత విద్య నేర్పినచో వారిక ముందు కల్లుగీతవృత్తిలోనికి దిగకుండ నుందురు.

ఇప్పుడు ప్రపంచము మారి పోయినది. ప్రాతపరిస్థితులకు గొప్ప సంచలనము గలిగి యున్నది. పరిస్థితులకను గుణమగు విధమున ప్రతివారును తమతమ ప్రాచీనవృత్తులను మార్చుకొని యున్నారు. వేదఘోష విని పించవలసిన స్థలములలో, ఆంగ్లేయ భాషోచ్చారణము విని పించుచున్నది. పంచ మహాయజ్ఞములుగావించవలసిన యిండ్లలో

ఖండాంతరపు సరకులు గానుపించుచున్నవి. వీరోచితమాత్ర ధర్మము వర్తింప బడ వలసిన స్థలములలో వ్యవసాయము వాణిజ్యము కానిపించుచున్నది.

ఇట్లు యూరప్ప్రపంచము తాగుమాత్రైనను మన సెట్టిబలిజ, మిలెటరీ సిఫాయికంటె బరువగు సామానులను పైన వేసుకొని తాటి చెట్లెక్కుచున్నాడు. ఈ మద్య పానమున లక్షల కొలది బీదజనులు కుప్పకూలి భ్రష్టులగు చున్నారు. ఏది యెట్లున్నను, దేశమందలి మద్యపానాది దుష్కృత్యములకు మన వర్ణమే ప్రత్యక్షసాధనముగా గానుపించుచున్నది.

దీనిని నాశనము చేయుటకై ఎందరో మహనీయులు పూను కొనుచున్నారు. కాని దీనివలన వచ్చు, వచ్చువడియొక్క మోజును బట్టి అక్రమకార్యమైనను, దీనిని హఠాత్తుగా రూపుమాపుటకు వీలు గాకున్నది.

ఇది నిలచియుండునంత కాలమైనను క్షీణించుచుండును గాని అభివృద్ధిగానుండ జాలదు. మన సాంఘిక లీవృత్తియందుండి ధనాధి కులగుటకుగాని నీతివంతులగుటకుగాని యవకాశములేదు.

ఈ వృత్తి నిరపాయమైనదిగాదు. కలుకుకత్తులతో సాము. కన్నులు తిరిగిపోవునంత యెత్తుగల తాటిచెట్లపై నెక్కవలెను. తాటిమువ్వ లలోని మిడినాగులు కరచి మరణించిన వారెందరో గలరు. తాటి చెట్లపైనుండి అకస్మాత్తుగా పడి మరణించిన వారెందరో గలరు. స్త్రీలకుగాని పురుషులకుగాని యీవృత్తి వలన నుత్తేజము గలుగదు.

వేమనవంటి తాత్వికుడుగాని, శ్రీనాధునివంటి మహాకవిగాని రాము మోహనుని వంటి సంస్కర్తగాని మన సంఘమునుండియు త్పత్తిగా కుండుటకు కారణమేమి! ఈశ్వరప్రసాదిత మగు జ్ఞానమును సవ్యముగా నుపయోగింపక పోవుటచేతనే గదా?

సెట్టిబలిజ సాంఘికులారా! దేశమందలి సంచలనముఁ గాంచుడు. ప్రతిసంఘ మెట్లుల్లభివృద్ధి నొందుచున్నదో చూడుడు. విద్యాభివృద్ధికి ముందంజవేయుడు.

సంఘమందలి విద్యాఘనులారా!

మీరు స్వార్థత్యాగమున కోర్చి సంఘమునకై సారస్వతమును కూర్చుఁడు. సెట్టిబలిజ యువకవి పుంగవులారా! సెట్టిబలిజ విద్యాధికులారా! మీలేఖనిని సంఘాభివృద్ధికై యుపయోగింపుడు. మీవచోమృతధారలచే సంఘాభిమానమును పెంపునొందింపుడు.

సంస్కర్తలారా! మన సంఘమందలి ప్రాచీనమూఢాచారములను పెకల్చివేయుడు. సుఖజీవన విధానమును నేర్చి సంఘోద్ధరణముగావింపుడు—లెండు.

(చప్పట్లు గొట్టుదురు.)

పురు—(ముందునకువచ్చి) జాతీయ సోదరులారా!

సీ. సతతసదాచార । సంపన్నులగనుంట
జాతికిన్ మీకు ప్ర । ఖ్యాతిసుండు
ప్రతి గృహంబున । బాలబాలికల్ చదివిన
జాతికిన్ మీకు ప్ర । ఖ్యాతిసుండు
కూడుగోర్ ప్రజకు । చేదోడువాదోడౌట
జాతికిన్ మీకు ప్ర । ఖ్యాతిసుండు
సరసప్రభుత్వ ప్ర । జాసంస్థలందుంట
జాతికిన్ మీకు ప్ర । ఖ్యాతిసుండు

గీ. దేశకాలపరిస్థితుల్ । దెలసి కనులు
దెఱచి యోగ్యులుపోవు । తెన్నరసిసంఘ

మన్నిటం గీర్తిపంత । మానట్లు చేయ
జాతికిని మీకుఁగూడ బ్ర । ఖ్యాతినుంకు ।

(హర్షధ్వనులు)

(ముందునకువచ్చి) విద్యానంపదల తులఁదూగునోసోదరులారా!

సీ. దేశసంస్కరణకై । దేహముల్ గోల్పోవు
నన్యోపకారుల । నరయుతేదె ?
భాషాభివృద్ధికై । బాములుపడుచున్న
విద్యాభిమానుల । వెతకలేదె ?
అన్యజాతుల వార । లాత్మ బాంధవసేవ
చేయుచుండుటను పీ । క్షింపలేదె ?
తాపససమితిలో । కోపకారార్థంబు
కర్మలన్ జేయుట గాంచలేదె ?

గీ. అన్ని విధముల నందరు । నభిమతార్థ
సిద్ధిగాంచుట చూచిన । సిగ్గుగాదె
ఏల మన సంఘ మీరీతి । బేలపడుట
కడిది కార్యముల్ సేయంగ । దొడరరాదె ?

వేయుమాటలెందులకు ?

ఖడ్గ—

సీ. సహజప్రపత్తుల । సరణి నొప్పెడు, యుష్మ
దాత్మలఁ బౌరుషం । బుండునేని
పరగదురాచార । పద్ధతి జాతిహైన్య
తకు హేతువుగ । దలఁతురయేని ।
చెలువుమీరఁగ । సెట్టిబలిజ నామాంకురి
స్వర్ణాక్షరములతో । వ్రాతురేని ।

బాములనెడఁబాపి । పలువిద్యలనునేర్పి
యువతీమణులఁ । గావనుంటిరేని
గీ. అది యిదేటికి సంఘమ । త్యుదిత దశను
నలరి తుల దూఁగవలెనని । తలఁతురేని
శమదమంబులతోడ హె । చ్చరిక గల్గి
పాటుపడరింపు జాతీయ । ప్రవరులారా ?
ఖడ్గ—ఐకమత్యము, అభిమానము, సంఘాభివృద్ధికి పెట్టని కోటవంటివి.
అందునకు, కులమనగా ?
సీ. ధనికదరిద్రాది । జనుల జాతీయుల
వదలక చేర్చు కు । న్నది ఎ కులము
కులము వారేదేశ । ములను గాన్పించిన
వదలక చేర్చు కు । న్నది ఎ కులము
వారువీరనకను । వర్ణస్థులందరి
వదలక చేర్చుకున్న । ది ఎ కులము
తాత బావాయని । తన వారి బిలుచుచు
నైకమత్యము జేయునది । యె కులము
పగమనవహాకారి ముంజేతి । ఫలము కులము
గురుతరంబైన భవ్య సం । కులము కులము
అట్టి గోత్రాభివృద్ధికై । యందరమును
తగు ప్రయత్నముల్ జేయుట । ధర్మమయ్య.
(సభాస్థలినుండి యొక ముసలి యవ్వలేచి) నాయనలారా
నాదొక మనవిచిత్తగింపుడు.
(సభాస్తలినుండి నోనో కూర్చుండుము. కూర్చుండుము)
ఖడ్గ— ఆగుఁడు—ఆయవ్వ యెవ్వరో ఏదో చెప్పుచున్నది. మాట్లా
డ నిటురానిండు.

మున—(వణకుచూ సమీపించి) ఇదిగో నాయనా

ఖడ్గ—ఏమిటవ్వా యవి?

మున—రూపాయలమూట

ఖడ్గ—ఎక్కడివి.

మున—నాభర్తగారు చనిపోవుతరి నిచ్చినవి.

ఖడ్గ—ఎందులకు.

మునలి—ఎందులకా - యిచ్చి॥ సంఘసేవ, జేయునగ్రృష్టమునాకు పట్టినదికాదు. ఇక నాతనువు నిరర్థకముగనే యీప్రపంచమును వీడిపోవుచున్నది. ఎప్పటికైన, నెవరైన మహనీయులు, నేను జన్మించిన యీసెట్టిబలిజ సంఘము దుస్థితిని చింతించి సంఘాభివృద్ధికి పాటుపడుచో వారికీధన మొసంగి దీనిని బీద విద్యార్థుల విద్యాభివృద్ధికి వినియోగించ వలసినదిగా చెప్పుమని ప్రాణములవీడిరి.

ఖడ్గ—ఆహా యెంతటి యుదారస్వభావము. వారి యాత్మకు శాంతి గలుగుగాక?

చిదం—అమ్మ మహనీయుడిప్పట్లనున్నచో ఎంతబాగుగ నుండెడిది.

వృగు—సంఘాభివృద్ధినిగూర్చి పరితపించి యుద్యమ ప్రారంభకులు లేక యెల్లెందరు తమ ప్రాణములను సంఘ దుస్థితిని స్మరించుచు వీడిరో గదా?

ఖడ్గ—అమ్మా! ఎంత మొత్తము—

మున—పదునైదు వేలు.

ఖడ్గ—వారి పేరు.

(సభలోనుండి) రామస్వామిసెట్టి

ఖడ్గ—అట్లయిన దీనిని మూలధనములో చేర్చి బీద విద్యార్థులకు యిచ్చు ఏర్పాటు గావించవలయును.

మున— నాటినుండియు నీధనమును వడ్డికిచ్చి భద్రముగ కాపాడితిని. యిప్పటికి పదునైదు వేలైనది. నాకును వార్ధకము హెచ్చుటచే ఓపిక తగ్గిపోవుచున్నది. నాభర్తగారి యభీష్టము నెరవేరదేమోయను చింతయునన్ను దినదినము పట్టి బాధించుచున్నది. ఇప్పటికి నానాథుని కోర్కె తమ మూలమున యీడేరినది. వారి యాజ్ఞ చెల్లించ మనసిన నావిధియు నెరవేఱినది.

ఖడ్గ— అమ్మా! ఈసొమ్మును మూలధనములో చేర్చి "నాగస్వామి నిధి" యనుపేరుతో వారి యానతిని శిరసావహించెదము.

మున— చిత్తము. నాకునదే కావలయును. (కూర్చుండును)

చక్ర— (లేచి తనలో) ఈసభను పాడుచేయ వలసినదిగా కపటోద్దేశియగు దురోదర యాజ్ఞానుసార మీపరివారముతో నిటకు వచ్చితిని. ఇమ్మహనీయుల ప్రబోధము పాషాణహృదయములను గూడ ద్రవింపజేసి కాల్వలట్టుల ప్రవహింపజేయుచున్నది. ఇట్టి హితవచనములకు నాలోని మంకుమతి మాయమైనది.

అజ్ఞానాంధకారమున మునింగి- సంఘము నేవగించి- స్వకామోత్తరో వృథావ్యయములకు వెచ్చించి- నిర్లక్ష్యముగ దిరిగిన పాపుండను. నిజముగా సంఘాభివృద్ధికి పాటుపడుటయన చాల పారమార్థికవిషయము. నావంటి యధమాధము లీ సంఘమున బుట్టి- దాని యభివృద్ధికి పాటుపడక- ఏవగించుకొనియుంట చేతనే సంఘమిట్టి హీనస్థితికి వచ్చినది. నావంటివాడు, నేను వెచ్చించు ధనము, నంపల కొలది బీదవిద్యార్థుల విద్యాభివృద్ధికి సాయపడెడిదిగదా? అట్లాచరించినచో నీపాటికి సంఘము సెట్టిబలిజ విద్యావంతులతో తులతూగుచుండెడిదే? ఛీ, జీవచ్ఛవము చందమున నూరును పేరును-ధర్మ

ము దాక్షిణ్యము లేక చరించు నా బ్రతుకెందులకు. నిష్ప్రయోజన మైన నా జీవితము, నిరర్థకమైన నా యర్థము, యెవరానందించునది. ఎవరికుపకరించునది.

ఇసీ! ముసలి యవ్వపాటి బుద్ధికూడ నాకు లేకపోయినది. సంఘమునందెంత యభిమానము లేనిచో, భర్తగారు విడచిపోయిన ధనమునంత జాగ్రత్తగ నభివృద్ధిచేసి, యిట్టి మహాకార్యమునకు మార్గదర్శియయెనా! స్త్రీ[illegible] సైతము సంఘాభిమానమిమిడి యున్నది గాని, నావంటి నీచునకది యింతవరకు గోచరించినదే గాదు.

(ఇ[illegible]చుకంత యోచించి) ఇప్పుడు మాత్రమేమైనది. నా కెంతో ధనమున్నది. ఈ ధనము మొదలు చెడు స్నేహితులకు, దుర్వ్యయము లకు వదలుకొని నిష్కళంక కార్యము లను సేయు సంఘాభిమా నులను నగు వీరితో కలసి నిష్కళంకముగా సంఘాభివృద్ధికై పనిచేయు దును. నా ధనములో నుండి యిరువదివేల రూప్యములను బీదవిద్యార్థ నిధికిచ్చెదను. కాని ప్రస్తుతము నేను వచ్చిన యీ కపటోద్దేశ మును వీరల కెరిగించి దురోదరు నేల సంతోషపెట్టయలయును. అట్లు చేయుట మంచిదిగాదు. మరల వారి స్నేహము జేయకుండుట యే యిప్పటికి మంచిది. పోయి ఖడ్గనారాయణుని కాళ్ళపై బడి సన్నిక మిత్రునిగా పరిగ్రహింప ప్రార్థించెదను. (సమీపించి ప్రకాశ ముగా) మహాశయా! నమస్కారములు.

ఖడ్గ—సోదరా! తెలియదు. మిమ్మొకసారి చూచిన జ్ఞాపకమున్నది.

పుర—సైకిలుపైనుండిపడి ధూళితో నున్నతరి.

ఖడ్గ—ఔను! జ్ఞాపకమువచ్చినది.

చక్ర—అప్పటి నాయవినీతికి సిగ్గుపడుచున్నాను.

ఖడ్గ—(మీదచేయివైచి నిమురుచు) సహవాసదోషముగదా! అందు

మీ తప్పేమి యున్నది!

చక్ర—నేను సంఘద్రోహిని. సంఘమునకు, దాని యభివృద్ధికి పాటు పడువారలకు మహాపకారమును చేయదలంచిన పాపిని. ఇక పైని మీ చరణసేవతోపాటు, సంఘసేవఁజేయ కుతూహల పడువాడను.

ఖడ్గ—మేము వాంఛించునదియే!

చక్ర—నాకున్న ధనమునుండి యిరువదివేల రూప్యములను విద్యానిధికిమ్మట కిప్పుడే మీ యెదుట వాగ్దానముచేయుచున్నాను. పరిగ్రహింపుడు.

ఖడ్గ—మహాభాగ్యము.

(సభలో హర్షధ్వనులు)

పురు—మిత్రమా! మీరు మాతో కలసి పనిచేయుటెంతయు శుభదాయకము. ఇక సంఘసేవ సులభసాధ్యముగా తలంతుము.

చిదం—తమవంటి ధన్యతములు పూనుకొనిన నే కార్యములు నెరవేరకుండును. మహాత్మా! పవిత్రమగు తమ చరితము అస్మదాదులకు మార్గదర్శిని యగుఁగాత?

# సెట్టిబలిజసంఘసేవ

## పంచమాంకము

రంగము ౧

(ప్రవేశము — ఖడ్గధరుడు విచారము నభినయించుచు)

ఉ. చేసిన చేతలన్నియును । చేటును బొందెను వారి కార్యముల్
భాసిలుచుండె నెల్లయెడ । వారము వారము వృద్ధిఁ బొందుచున్
రోసినవారలెల్లఁ గను । రూకలనిచ్చుచు నుండ్రి యక్కటా!
ఏ సరణిన్ మదీప్సితము నిత్తఱి తీరుచుకొందునో గదా!

చేయవలసిన పనులన్నియు చేసితిని. పన్నవలసిన పన్నుగడల నెన్నియేని పన్నితిని. ఖడ్గనారాయణసెట్టి యీ కడ తేరలేదు. ఉద్యమము భగ్నము కాలేదు. ఉద్యమ ప్రోత్సాహులా దినదినాభివృద్ధి గాంచుచున్నారు. ఆచరించు వారా యధికమగుచున్నారు — ఇప్పుడిఁకేమున్నది. కడపటియత్నము కడ తేర్చుటయే? అందుకొఱకే త్రాగుబోతులనిద్దఱను కబురుచేసితిని. ఇప్పటికి రెండుదినములక్రిందట ఖడ్గనారాయణమున్నగు వారలీసమీపగ్రామమునకు పోయినట్లు తెలియుచున్నది. వారీ రాత్రిపూట తప్పక తిరిగి రాగలరనుచుండి వార్త కూడ తెలిసినది. — ఈ ప్రాంతము చెట్లతో, పొదలతో, చాలకట్టముగను, నిర్జనముగను, నా ప్రయత్నమునకు సాయపడురీతి ననుకూలముగనే యున్నది. అర్ధరాత్రియందీ త్రోవల చలిచీమలుకూడ సంచరించవు. వీరినెట్లయిన నిందు మటుమాయము గావించితినా నాకోర్కె తప్పక సిద్ధించగలదు. ఏమిది — హృదయమాందోళన పడుచున్నది. ఛీ! పిఱికితనము పిసుగునకు వారసూలా? ఇట్టివన్నియు నా

వంటిధైర్యశాలి లెక్కచేయఁదగినవికావు.—అయినను, (యించుక దీనవదనముతో)

శా. దేవా యెట్లుల చూచెదో దయను నీ కే దే భారమీకార్యముల్
వేవేగన్ సఫలీకృతంబుగనగన్ వేజేయుమీ శూరతన్
భావాతీతదయాస్వరూపవ్యహారీ భావింతు నేనెప్పుడున్
నీవాడన్ నను బ్రోవవే మరతువే నీ భక్తవాత్సల్యతన్.

దైవము నన్ననుకూలించును. ఇది చాలునుదినము. నా ప్రయత్నమున కడపటిదినము. కథ యంతరించునదికూడ నీ దినమే. ఆహా! పట్టరాని సంతోషముచే గాబోలును నా శరీరము పరవశమగుచున్నది. శత్రుదండనమున కిక సంశయింపనక్కరలేదు.

(ప్రవేశము. నౌకరు)

దురో—ఏమిరా యిటువచ్చితివి.

నౌక—తమకొఱకు యిద్దరు మనుష్యులు వచ్చినారండి.

దురో—ఇటుతీసుకొనిరా!

(నౌకరు నిష్క్రమించి తిరిగి యిద్దఱితో ప్రవేశించును)

(నమస్కరింతురు.)

దురో—ఎందరు వచ్చినారురా?

దొం—ఇద్దరమండి.

దురో—మిగతవారేరి?

దొంగ—వస్తారండి, పని ఏంటో చెప్పిం తరవాత.

దురో—పనియేమియును లేదు. ఇటురండు. మీరు ధైర్యమైనవాళ్ళేనా?

దొంగ—ఓ! కావలసినంత. ఎవళ్ళైనా చంపేయమంటే చంపేస్తాం.

దురో—ఇప్పుడదే చేయవలసినపని.

దొంగ—ఇప్పుడు చంపమంటారా!

దురో—ఎవరినిరా! ఇక్కడెవరున్నారు.

దొంగ—తమచిత్తం.

దురో—అయితేగాని ఒకమాట. ఈ మార్గముగుండ అర్ధరాత్రిసమయమున నలుగురు మనుష్యులు వచ్చెదరు. వారిగుర్తులు చెప్పెదను. తత్క్షణము పైబడి హత్యగావించవలయును.

దొంగ—ఒకరు కనబడితే!

దురో—ఒకరినైనను సరే?

దొంగ—చిత్తం. మీరుఎక్కడ వుంటారు.

దురో—నేను సమీపమందే యుందును.

దొంగ—చంపిన తరువాత మిమ్మల్ని పిలుస్తాం.

దురో—పిలువవద్దు. కో' యన్న నేనేవచ్చెదను.

దొంగ—సరే ఏమన్నా యివ్వండి తాగడానికి.

దురో—తరువాత చూచుకొనవచ్చును. ఈ పరిహాసాయలు పట్టుకొని వెళ్లండి.

దొంగ—చిత్తం. బాబు. (నిష్క్రమింతురు)

దురో—ఎట్లో యీ పని నెరవేరువరకు నిద్రాహారములు త్యజించవలయును. ఈ దినము వీరివెంట నంటి అప్రదేశమునుచూపి, తగిన రహస్యస్థలమందుంచి పనిచేయించవలయును. వేళయగుచున్నది.

(నిష్క్రమించును)

2. రంగు

(ప్రవేశము—ఖడ్గనారాయణ, చిదంబరశెట్టి పురుషోత్తము, చక్రపాణి)

పురు—మనమీ యర్ధరాత్రిమున ప్రయాణము చేయుట ప్రమాదసూచకముగా నున్నది.

చిదం—ఊరక యశ్లీలము లేల నులకు. మనకార్యభారమే యిట్టియసమయములందు ప్రయాణము చేయించుచున్నది. అయినను

మనకు రాత్రియని, పగలని తలంచవలసిన పనియేమున్నది.

చక్ర—అర్ధరాత్రిమున చోరులయొక్కయు, క్రూరజంతువుల యొక్కయు భయముండుట సహజము. విశేషించి శత్రుభయము గూడ వాటిల్లుచుండును.

ఖడ్గ—మనపై నంత పగతలంచు విరోధులెవరు. మనకు ప్రపంచమంతయు నిష్టులే. మనమెవరులకు హానితలంచు విధానమున సంచరించువారముగాము. శత్రుభయమన్న సంగతివీడి చోరక్రూరమృగముల యలజడినించుక గమనించవలసినదే?

చిదం—పరుల కపకారముఁ జేసినశత్రులు, ఉపకారముచేసిన మిత్రులని తలంచరాదు. అందరు నొక్కరీతినుండరు. మనకు మిత్రులవలె గన్పట్టి మన నలనియపకారము తలంచనివారు సహితము—ఊరక యపకారముఁ జేయప్రయత్నింతురనుట సత్యదూరముగాదు.

ఖడ్గ—అయిన నిప్పుడా విషయమెందులకు. మనము మార్గమధ్యమున నుండి శంకించిన లాభమేమి. ఈశ్వర ప్రేరేపణలేనిదే కష్టముగాని, సుఖముగాని గలుగదు. కాని కొంచెము జాగ్రతగ మాత్రము క్రిందచూచి నడచుట మంచిది!

(నడచుచుందురు)

(ప్రవేశము—దుర్గోదయుడు. ఒకవిషజంతువు ఏదురువచ్చును)

దుర్గో—అల్లా! ఏమిది. దుశ్శకునము. ప్రమాదము వాటిల్లును గదా! ఛీ! ఏమి ప్రమాదము. ఏమిభయము. ఇట్టితగుణమున శకునము పాటించరాదు.

(ముందునకు చరచరనడచి పోవును)

(ప్రవేశము—దురోదరుడు పొదలలోనుండు, నిష్క్రమింతురు)

ప్రవేశము. దురోదరుడు. ముందునకు వచ్చి. ఎవరురా అక్కడ.

దొంగ—చిత్తము. మేమండి.

దురో—ఈ మార్గముగుండనే నేను చెప్పిన నలుగురువత్తురు. గుర్తులు జ్ఞాపకమున్నవి గదా?

దొంగ—చిత్తం. బాబయ్యా సంఘుంఅంటూ తిరుగుతారు ఆమనుష్యులు.

దురో—అవును. చాలజాగ్రతగ గుర్తించవలయును!

దొంగ—చిత్తం, చిత్తం.

దురో—నేనీ సమీపమందే దాగియుందును. మీరుకూడ ఆ పొదల చాటున దాగియుండుడు— (నిష్క్రమింతురు)

(ప్రవేశము. ఖడ్గ, చిదం, పురు, చక్ర)

చిదం—ఈ మార్గముగుండ మనినాలుగు దారులు గాన్పించుచున్నవి. ఇందేమార్గమున మనము పోవలయునో!

పురు—ఇది చాలకష్టమగు విషయమే! అపరిచితులు గుర్తింపజాలరు.

చక్ర—ఇది నలిగినదారి. తరచు ప్రయాణము చేయువారలీ దారిని పోదురని నలగిన యీ దారినిబట్టియే తెలియుచున్నది.

ఖడ్గ—ఇదియంతయు నిర్జనమై, దట్టమైన పొదలతోను చెట్లతోను నిండియున్నది. నలగిన త్రోవను పోవుటేమంచిది. యింకను కొంచెము నిదానించుడు.

(నడచుచుందురు)

(ప్రవేశం—దురోదరుడు)

మాటలు వినవచ్చుచున్నవి. వచ్చుచున్నట్లున్నారు. బలే! జాగ్రతగ నుండవలసినదిగా చెప్పి వచ్చెదను.

(త్వరత్వరగ పోవును.)

(తాగుబోతులు దురోదరునిపై బడి చిదుకగొట్టుదురు. పెద్దపెద్ద కేకలు వేయును)

(ఇంతలో—ఖడ్గ. చిదం, పురు. చక్ర. ప్రవేశం)

అదుగో! ఎవ్వరిదో మనుష్యరోదనము వినవచ్చుచున్నది. పరుగెత్తుడు, కేకలు వేయుడు. ఎవరు వారు- వచ్చుచున్నాము. భయపడకుడు. భయపడకుడు.—

((తాగుబోతులు పారిపోవుదురు)

ఖడ్గ—(దగ్గరకువచ్చి మొగముపరికించి) అయ్యో! పాపము. దురోదరుఁడు, దురోదరుఁడు.—(రక్తముగారుచున్న గాయములకు కట్టుగట్టుదురు)

ఖడ్గ—మహాత్మా! నిశీథసమయమునందీ నిర్జనప్రాంతమునకు తమరేమి పనిమీఁద వచ్చితిరి. దుర్మార్గులగు తాగుబోతులెంత క్రూరముగ దండించిరి. అయ్యో! రక్తము స్రవించుచున్నది. (జేబురుమాలుతో వత్తుచుండును.)

దురో—(విచారముతో ఖడ్గనారాయణు నుద్దేశించి) అయ్యా! నమస్కారము. (చేతులుజోడించి)

గీ. మాన్యచరితులు సంఘాభి । మానులీరు
మాంద్యుఁడను నేను యుక్తము । మరయలేక
నిటనిశీథిని నన్నుచంప । నిలచితయ్య
రాక్షసత్వము నూని నా । రాయణాఖ్య ?

(అందరు ఆశ్చర్యపడుదురు)

ఖడ్గ—ఆర్యా ? అదేమి అట్లనుచున్నావు.

దురో—నాయనా ? ఏమున్నది

తే. గీ. చేసితిని మీయెడలగొప్ప । చెనఁటికార్య
మార్య! నవినయమునఁగపట్ను । లరయుమయ్య

సంఘ సౌభాగ్యమునుగోరి । సకలవిధు ల
హర్నిశము పాటుపడుమిమ్ము । నరయలేక
కపట సంఘాభిమానిగా । నటనచూపి
విఘ్న మొనరింప లోలోన । వేనవేలు
కృత్రిమాలోచనలు మిమ్ము । కూలద్రోయ ?
పన్నితిని, సంఘద్రోహిని । పాతకుడను
వెంగలిని బుద్ధిహీనుడ । నగుదు నేను
కాని నాచేతలన్ని వి । ఘ్నంబులయ్యె
నైన సంతుష్టితో కోప । మాపలేక
తమ్ము వధియింపఁగోరితి నైన । త్రాగుబోతు
దుండగీండ్రను రావించి । తోవనుంచి
పొంచియుంటి నిశీధినా । పొదలలోన
నింతలో మీరు రాక నా । లించిచెప్ప
నేగ; నన్నె మీరని దుండగుల్ । వేగగొట్టి
రంత కేకలువేయ మీ । రాకచూచి
పారిపోయిరి యిదినాడు । పాపఫలము
సాధులగు మీయెడల నేను । సలిపినట్టి
ద్రోహబుద్ధికి దైవమీ । తెన్ను చూపె
నన్ను క్షమియింపుమయ్య సం । వన్మనీష ?

(దురోదరుఁడు ఆయాసముతో నిట్టూర్పులు విడచుచుండును)

ఖడ్గ—(తనలో) ఏమిది ఆశ్చర్యము. మమ్ములను కడతేర్పుటకు ప్రయత్నించినట్లుగా యున్నది. (ప్రకాశముగా) మహాత్మా ! గతించిన విషయములను గూర్చి విచారింపకుఁడు. అయినను మీ మూలమున మాకార్యమునకుగాని మాకుగాని నష్టమునుదయేమి గలుగలేదు.

చిదం—(తనలో) ఈ దుర్మార్గునకు నేనన్న విధమువనే మర్యాద జరిగినది. దైవము న్యాయమును తిలకించదా! ఈతఁడు వన్నిన యుచ్చులో నీతడే తగుల్కొనెను. ఇంకను యిట్టివెంగలిజీవించి యుండు టనర్థదాయకమే ?

చక్ర—(తనలో) నే చెప్పినమాట వినక దుర్మార్గమునకు తలపెట్టి నాడు.

పుర—రంగయ్యగారి కీడో మొరిగించువానివలె నటించి యేవగింపు గలిగించిన దితడేయని యిప్పుడు తలంపవలసియున్నది.

దురో—చిదం, పుర, చక్ర, ఖడ్గనారాయణులవంక తిరిగి నమస్క రించి) అబ్బా! ఆయాసము.

తే. గీ. చదువుకొన్న నాయనలార । సరసులార
మాన్యవరులార సంఘాభి । మానులార!!
వినుడు నాచరితంబింత । వినువుకొనక
బాల్యమాదిగ నేటికి । బరులయశము
ఘనత సౌభాగ్య మభివృద్ధి । కనులఁగాంచి
సైరిడని రోజులేదైన । నితరులకడ
నక్క వినయాలతో కడు । నక్కజముగ
వారి మేలును గోరెడి । వానియట్లు
తిరిగిమొట్టులో గోతులోఁ । ద్రెళ్లఁజేయు
వాఁడ, వీరైనకొంపల । పాడుచేసి
కీరితి ధనంబుకొంత చే । కూర్చినాడ
ఇతరులకు మేలుచేసి । యెఱుంగ నెపుడు
చేయకున్నను మేలును । జేయువారిఁ
జేరి కొండెములనుజెప్పి । చేటుకూర్చి

కార్యమెల్లన గంగలోఁ । గలుపకున్న
సిగ్గుబోవని నీచుఁడ । నింకనెన్ని
యేని, దుర్మార్గములను । నింతేని, పావ
మని, కట్టిగుడువు నె । వ్వటికినైన
యని, తలంపక చేసితి । నార్యులార !
నావలెనేలోన నొకటియు । బైకినొకటి
కృతిమాలోచనలు వన్ని । క్రూరకార్య
ములను గలపెట్టి పరుల కొం । పలనుగూల్చి
సంఘసౌభాగ్యమునకును । సాంఘికులకు
నపకృతులొనర్చి నీచులి । ట్లధములగుచు
నిజమలొందుట నిక్క । మింకెన్నఁడిట్టి
పనులు చేయఁగఁబోనని । ప్రజ్ఞలైన
భవ్యభవదీయ సన్నిధిఁ । బలుకువాఁడ !

మహాసీయూ, మీ యెడల నాచరించిన ద్రోహబుద్ధికి పరిహా ర్థము నా పుత్రీకారత్నము నిచ్చి పరిణయమూచరించినగాని నాజన్మ ధన్యతంగాంచదు. శీఘ్రమే యీపని నిర్వర్తించఁదగును మీారీ విష యమున వేరు విధముగా చెప్పరాదు. రండు.

(నిష్క్రమింతురు)

తెరగంగము

వివాహమంటపము

(ప్రవేశము:— దురోదరుడు, సుమ, చిదం, పుష్ప, ఖడ్గ, చక్ర సెట్టి లోక విద్యార్థులు, ఉద్యోగీయులు మొదలగువారు)

దురో—కుమారీ! నీయభీష్టమీడేరినది. ఈ పుష్పమాల నామహాసీ యుని కంఠసీమనుంపుము.

| | |
|---|---|
| 2. అర్ధ ... | 0– 6–0 |
| 3. కీచకవధ (౬ | 0– 2–0 |
| 4. కరుణాకము (ఖండ | 0– 4–0 |
| 5. భీమవరపుకోట ప్రయాణ... | 0– 1–0 |
| 6. పతిభక్తి (రాళ్ల గరగించును) | 0–12–0 |
| 7. ప్రసవపాతము (గంభీరభావము గలది) | 0– 1–0 |
| 8. రతిరహస్యము (సంస్కృతమునకు తెలుగుసేత) (అచ్చగుచున్నది) | |
| 9. శ్రీజయపురమహారాజా విక్రమదేవవర్మ పట్టాభిషేకము | 0– 2–0 |
| 10. గాంధిశతకము అచ్చు కాలేదు | |
| 11. ఆంధ్రవ్యాకరణము | 0– 8–0 |
| 12. Our Christmas excursion | 0– 3–0 |
| 13. జ్ఞానాంజలి (పూర్వార్ధము) ఇవి పదునొకండు శతకములు 1120 పద్యములు | 0– 4–0 |
| 14. జ్ఞానాంజలి (ఉత్తరార్ధము) అచ్చు కాలేదు. | |
| 15. సెట్టిబలిజశతకము | 0– 2–0 |

వలయువారు:—

పండిత పి. సత్యనారాయణరాజుగారు

తణుకు

పశ్చిమగోదావరిజిల్లా

అని వ్రాసిన బడయగలరు.

| | | |
|---|---|---|
| 1. | రంగం రహస్యాలు | 0— 2—0 |
| 2. | స్త్రీల పెండ్లి పాటలు | 0— 3—0 |
| 3. | త్రాగుడు పాటలు | 0— 2—0 |
| 4. | ఆంధ్రబర్మా కార్మికయుద్ధము | 0— 4—0 |
| 5. | సెట్టిబలిజనాయకరత్నాకరము | 0— 8—0 |
| 6. | గయోపాఖ్యానం | 0—10—0 |
| 7. | సెట్టిబలిజ శతకం | 0— 2—0 |
| 8. | సెట్టిబలిజసంఘసేవ | 0—12—0 |

వలయువారు:—యీక్రింది వారికి వ్రాయవలయును.

సెట్టిబలిజగ్రంథమండలి

నత్తారామేశ్వరం,

అత్తిలిపోష్టు.

పశ్చిమగోదావరిజిల్లా.

అద్దేపల్లి లక్ష్మణస్వామినాయుడుగారి
సరస్వతీ పవర్ ప్రెస్ నందు ముద్రితము, రాజమండ్రి-6768-32.

